JAGATI Rs. 2-00 June 1988

33rd Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

జూన్ - 1988



'హల్లో - బావున్నారా?'

—'న్యూస్ ఫ్రమ్ ఇజ్రేల్' సౌజ

'జగతి' - 2, కచేరి రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004 ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24-00, 2 సం॥లకు రు. 45-00, 5 సం॥లకు రు. 100-00, జీవిత చందా రు. 300-00, విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: మహారాష్ట్ర గవర్నరు బ్రహ్మానందరెడ్డి

# నిమ్మతొనలు

వెంకట్రావు కల్పనని ఆరునెలల నుంచీ ఆగకుండా ప్రేమించి మరీ పెళ్లి చేసుకున్నాడు. అంతటితో ఆగక, 'ఇక నా జీవితం నీకు అంకితం' - అన్నాడు పరవశత్వంతో.

"భలేవాడివి, నీ జీవితం నాకు అంకితమిస్తే మరి యింట్లో పనులూ బయట పనులూ ఎవరు చేస్తారు?" - అని నదురూ బెదురూ లేకుండా అడిగింది కల్పన.

—కె కోలల్లి
నెల్లూరు—2

చూడమ్మా, పావలా కాసు గిన్నెలో పడేసి, నన్ను అవమానిస్తున్నారు - అని బిచ్చగాని కంప్లయింట్.

'ఎంత వేయాలేమిటి?' - అని శ్యామలాంబ ప్రశ్నించింది.

'కనీసం యింకో పావలా అయినా పడెయ్యండి.'

'రెండుసార్లు అవమాన పర్చటం నావల్ల కాదబ్బీ' - అంటూ ముందుకి సాగింది శ్యామలాంబ.

—కె సత్యనారాయణ
మైలవరం

వెంకటేశ్వరస్వామి గుళ్లో శని వారం భజన జరుగుతోంది. ఎవరో ఒకాయన వచ్చి, తిరుగుతున్న ఫాన్‌ని చటుక్కున ఆపేశాడు.

'ఎవరయ్యా నువ్వు? తిరిగే తిరిగే ఫాన్‌ని కట్టేశావు' - అని ప్రశ్నించాడు ఒక భజనపరుడు.

'చెప్పాలా?' - అన్నాడా పెద్ద మనిషి చిరునవ్వుతో.

'చెప్పకపోతే మేము ఊరుకోము' - అన్నారు మరోనలుగురు ముక్త కంఠంతో.

'నా పేరు రామనాథం - ఈ ఫాన్ దానం చేసినది నేనే! కట్టేశాను కాబట్టి పేరు అడిగారు - లేకపోతే, నేను దానం చేసినట్టు మీకెలా తెలుస్తుంది?'

—డి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

ఏమయ్యా, మతిమరుపుకి వైద్యం చేయించుకున్నావ్ - ఫీజివ్వాలని తెలీదూ? - అని దండించాడు డాక్టరు గురునాథం, దారిన పోతున్న సోమయ్యని.

'బాబు, మీ దగ్గిరా నేను వైద్యం చేయించుకున్నది - పక్కవీధిలోని చిదంబరంగారనుకొని, ఆయనకి ఫీజు చెల్లించాను' - అన్నాడు సోమయ్య.

—వి నరసింహస్వామి
రాజమండ్రి-5

రామారావు, కుక్కని వెంట బెట్టు కొని, తన స్నేహితుని యింటికి వెళ్లాడు.

'గాడిదను తీసుకొచ్చావేమిటి?' - అని ప్రశ్నించాడో స్నేహితుడు సూర్య నారాయణ.

'గాడిద కాదు - యిది కుక్కే' - అన్నాడు రామారావు.

'నాకు తెలుసునయ్యా, నేను అడిగింది కుక్కని' - అని సూర్యనారాయణ.

—జియస్ శర్మ
అమలాపురం

అమ్మా, నేను సముద్రంలో ఈత కొడతాను - అన్నాడు రవికాంత్.

'వద్దు బాబూ, సముద్రం చాలా లోతుగా ఉంటుంది - యిది స్విమ్మింగ్ పూల్ కాదు' - అంది తల్లి సుమిత్ర.

'మరైతే నాన్నగారు ఈత కొట్టడానికి ఎందుకెళ్లారు?'

'ఆయన ఇన్సూర్ చేశారు.'

రవికాంత్‌కి బోధపడక మయంగా చూశాడు తల్లి వంక.

—వైవి రమణ
చీరాల

మేడమ్, మీకెన్నేళ్లు? - అని సినీ తార విద్యుల్లేఖని అడిగాడు విలేఖరి.

ఈ చొప్పదంటు ప్రశ్నతో విసు గెత్తిపోయిన విద్యుల్లేఖ 'ఇరవై' అంది.

'మేడమ్, పదేళ్ల క్రితం మా పత్రిక ప్రారంభ సంచికకు మిమ్మల్ని యింటర్వ్యూ చేస్తున్నప్పుడు కూడా ఇరవై అనే చెప్పారు. మా పాఠకులు కుశాగ్ర బుద్ధులు' - అన్నాడు విలేఖరి.

'నా ఏళ్లు (వేళ్లు), చేతులవీ కాళ్లవీ కలిపిఅప్పుడూ యిప్పుడూ యిరవయ్యే, బాబు' - అంది విద్యుల్లే.

—భవాని
మచిలీపట్నం-2







# పాఠకుల తీర్పు

ప్రియమైన చందూర్‌గారికి: నమస్కారములు. పది మంది సహృదయ స్త్రీలు ఒక స్నేహితురాలి ఉన్నతిని ఎంత గొప్పగా గౌరవించారు (1987 డిసెంబరు 31). మాలతిగారి లాంటి నిరాడంబర నిస్వార్థ వ్యక్తిని, ఏమాత్రం ఆడంబరం లేకుండా, సింపుల్‌గా వినూత్న పద్ధతిలో సన్మానించిన వారందరికీ మా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనలు.... 'మనవాళ్లన్న వాళ్లు మనల్ని కాకుల్లా పొడుచుకు తింటారేమోగాని, లోకంలో ఎంతో అనురాగం, ఆదరణ వున్నాయన్నారు' ఎప్పుడో ముప్ఫయ్యేళ్ల ముందు 'చంపకం చెద పురుగులు'లో మాలతిగారు— నిజమే! మీ 'డైరీ'లోని ఆ చివర మూడు పంక్తులూ ఎంత నిజం!.... గొప్పగా, హాయిగా, కులాసాగా చెప్పారు. స్నేహితుల మధ్య మీయిద్దరూ నిత్య యవ్వనులే - అన్నిటా.... చలం మ్యూజింగ్స్ - ప్రేమలేఖలు, జానకిరామ్ స్మృతి పథంతో - సాగుతున్న యాత్ర' తర్వాత, మీ 'డైరీ' సంతరించుకొంటున్న విశిష్టత....

—పివి రాజు

తిరుపతి

డియర్ చందూర్‌గారికి : నమస్కారములు. ఈ మధ్య మీమీద సాకు అంవమైన చిరుకోపం వచ్చింది. ఎన్ని లెటర్స్ వ్రాసినా, పోస్టుకార్డు మీదైనా జవాబివ్వరు.... డిసెంబరు 31వ తేదీ మీరు ఎలా గడిపారో తెలుసుకున్నాక భలే సంతోషం కలిగింది. మాలతీ చందూర్ గారి 'రాగం - అనురాగం' నవల నేను మర్చిపోలేనిది - చాలా బాగుంది.... మీ దంపతులు హాయిగా ఆనందంగా ఉండాలని, విభవ ఉగాది యింకా నెలరోజులు వున్నప్పటికీ, ముందుగానే శుభాకాంక్షలందజేస్తున్నాను.

—జి రాము

నందిగామ

శ్రీచందూర్‌గారికి:నమస్తే. సుమారు ఒక ఏడాదిగా మీతో ఒక గంటసేపు మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాను - కాని కుదరడంలేదు.... 'జగతి' అందగానే ఉత్తరం వ్రాదామనుకుంటాను గాని శ్రద్ధ.... ఏదో యడ్వెంచర్ చేయకుండా వుండలేను, చేతులు కాలి కాలి అలవాటై పోయింది. ఇతరులకు పువ్వులిచ్చే దాన్నేగాని కాల్చలేదు - కాలేవినా చేతులే కదా! 'అనామిక ఫ్లాష్' ప్రకటన పక్క పేజీలో చూస్తున్నారు కదా - 'అనామిక తిరిగి ప్రారంభిస్తున్నాను. నా ఆలోచన కార్యరూపం దాల్చడానికి కొద్దినెలల పట్టవచ్చు. 'ప్రతి గురువారం' పూర్తి కథ చదవాలని వుంది. మీవద్ద కాపీవుంటే పంపండి - భద్రంగా మావారి ద్వార మీకు తిరిగి అందజేస్తాను.

విజయవాడ-4

# ప్రాచీన సాహితి

సారాసారము బూను నింద్రియములన్ శాసించు లజ్జాన్వితుం
డై రాజిల్లు బ్రశాంతిజేకొను నరుం డంచాక నెందాక దు
ర్వారంబుల్ శ్రుతిమార్గగాములు నుదార భ్రూధనుర్ముక్తముల్
నారీ వీక్షణ బాణముల్ చొరవు విన్నాణంబుగా డెందమున్

—భర్తృహరి

సాధుసజ్జనులతో జగడమాడిన గీడు
కవులతో వైరంబు గనిన గీడు
పరమదీనుల జిక్కబట్టి కొట్టిన గీడు
బిచ్చగాండ్రను దుఃఖపెట్ట గీడు
నిరుపేదలను గని నింద జేసిన గీడు
పుణ్యవంతుల దిట్టబోవ గీడు
సద్భక్తులను దిరస్కార మాడిన గీడు
గురుని ద్రవ్యము దోచుకొనిన గీడు
దుష్టకార్యము లొనరించు దుర్జనులకు
ఘనతరంబైన నరకంబు గట్టిముల్లె
భూషణవికాస శ్రీ ధర్మపుర నివాస
దుష్టసంహార నరసింహ దురితదూర

—నరసింహ శతకం

అల వైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందార వనాంతరామృత సర్వ ప్రాంతేందు కాంతోరులో
త్పల పర్యంక రమా వినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము 'పాహి పాహి' యన గుయ్యాలించి సంరంభియై

—పోతన 'భాగవతం'

# పాతికేళ్ల నాటి పిక్చర్

## రాజరాజేశ్వరీ వారి 'ఆప్తమిత్రులు'

'ఆప్తమిత్రులు' అనగా స్నేహ ధర్మంలోని ఔదార్యమూ, ఔన్నత్యమూ స్నేహాభిలాష పట్ల మానవునికిని గల తృష్ణ, కొంతలో కొంత అయినా వ్యక్తమవుతాయేమో అనుకున్నాము. ఈ నిర్మాతలు అటువంటి భేషజాలు ఏమీ పెట్టుకోక, నేటి ప్రేక్షకులు ఎటువంటి సన్నివేశాలూ సందర్భాలూ చూడనిచ్ఛగిస్తారో, అటువంటివి మాత్రమే కల్పించి, వాటికొక కథారూపం యిచ్చి, వెండితెర కెక్కించారు. ఇద్దరు మిత్రులలో ఒకతను మొదటినుంచీ త్యాగశీలుడు ; రెండవతను కడపటివరకు దుష్కార్యాలు చేసి చివరి దృశ్యంలో మనకోసం పోలీసులకి వశమవుతాడు.

.... ప్రకాశ్ (ఎన్. టి. రామారావు), శేఖర్ (కాంతారావు), చిరకాల స్నేహితులు. శేఖర్ వ్యాపారంలో, ప్రకాశ్ కార్యదర్శిగా పనిచేస్తూంటాడు. శేఖర్ ధనవంతుడు, ప్రకాశ్ బీదవాడు. కాని ప్రకాశ్ చెల్లెలు విమలపై (కృష్ణకుమారి) శేఖర్‌కి కొంచెం అభిమానం. ఇలా వుండగా వ్యాపారరీత్యా బెంగుళూరు వెళ్లిన ప్రకాశ్, కామేశ్వరరావుగారి (రేలంగి) కూతురు కోకిలతో (రాజసులోచన) పుస్తకాలషాపు దగ్గర పరిచయం ఏర్పరుచుకొని, ఆ పరిచయాన్ని నెమ్మదిగా ప్రణయంలోకి దింపుతాడు. 'మారీడ్ లైఫ్' పుస్తకం కొనడంలో పరాయి మగవాడితో పంతం పట్టిన ఈ కోకిల, పెళ్లి కాకపోయిన పతివ్రతా ధర్మం పాటిస్తూ, ప్రకాశం కోసం చివరి వరకు కనిపెట్టుకునుంటుంది. .... ఈ లోగా శేఖర్, తన బ్లాకుమార్కెట్ భాగస్వామిపై, పేపరువైట్ విసరగా అతను చావడం, ఈ హత్యా నేరాన్ని ఆదర్శమిత్రుడైన ప్రకాశ్, తనపైన వేసుకొని అరెస్టై జైలు కెళ్ళడం, విమల తల్లి మరణం, విమలని శేఖర్ రహస్యంగా పెళ్ళాడటం, శేఖర్ తల్లి కమలమ్మ (కన్నాంబ) పెద్దింటి పిల్లని తన కొడుక్కి చేదామనుకోవడం, గర్భవతి అయిన విమల, తనకి జరిగిన అన్యాయం చెప్పుకున్నా కమలమ్మ వినకపోవడం, కోకిలను పొందాలని శేఖర్ కుట్రపన్నడం, కారాగార వాసం గడిపివచ్చిన ప్రకాశ్, కొన్ని అవరోధాల తదుపరి నిజం తెలుసుకోవడం, యివన్నీ అయ్యాక దుష్టుడు జైలుకి వెళ్తాడు - కథ ముగుస్తుంది. ఈ జనరంజక చిత్రానికి దర్శకులు కె.బి. నాగభూషణం.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - జూన్ 1963

*

# వెన్నెల కెరటాలు

## స్వీయ చరిత్ర

కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం రచించిన శతాధిక గ్రంథాలన్నీ ఒక ఎత్తూ, ఆయన స్వీయచరిత్ర ఒక్కటే ఒక ఎత్తూనూ! స్వీయ చరిత్ర సాహిత్య ప్రక్రియ కాకపోవచ్చు. చిత్తశుద్ధితో చిత్రించగలిగితే కల్పనకన్న వాస్తవికత హృద్యంగా రాణించ గలుగుతుంది. సరిగ్గా అదే విజయం చేకూరింది చిలకమర్తి స్వీయ చరిత్రకు. ఆయన తన స్వీయచరిత్రను ఒక వాహికగా వినియోగించుకొని, సమకాలీన చరిత్రకు దర్పణం కలిపించారు. నూరేళ్ళ పైబడిన జాతి చరిత్రకు ప్రాతినిధ్యం సమకూర్చారు. ఎందరో గొప్పవ్యక్తులూ వారి భోగట్టాలూ ఆద్యంతమూ దర్శన మిస్తూ మనోహరంగా సాగిపోతుందా గ్రంథం.

—సోమసుందర్
'స్రవంతి'లో

## 'రుద్రవీణ'

అతడు రూపంలో వామనుడు. కాని కవితా రూపంలో త్రివిక్రముడు. అతని కలం అగ్నిధార. అతని గళం రుద్రవీణ. అతడు అచ్చమైన, స్వచ్ఛమైన కవి. అఖిలాంధ్ర కవి. అతను ఎవరో కాదు. 'తెలంగాణ కోటిరత్నాల వీణ' అని నినదించిన దాశరథి కృష్ణమాచార్య. వరంగల్ జిల్లాలోని గూడూరులో సామాన్యమైన మధ్యతరగతి కుటుంబంలో అరువదేండ్ల క్రితం జన్మించిన శ్రీ దాశరథి, బమ్మెర పోతనలా సహజకవి. ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రుడు. నూటికి నూరుపాళ్ళ స్వాతంత్ర్య యోధుడు. నిజాం నిరంకుశ పాలనకు ఎదురు తిరిగిన కవి పుంగవుడు. అక్షరాలను అగ్నితూటాలుగా మార్చగల శక్తి అతనికి ఉంది. అభ్యుదయ నిరోధక శక్తులపై శతఘ్నులు పేలుస్తూ అగ్ని వర్షం కురిపించాడు. ప్రతీకార జ్వాలలు ప్రజ్వరిల్ల జేశాడు. అందుకే అతని కవిత ఆ రోజుల్లో నిజాం నవాబును గద్దె దించడానికి ఎంతగానో దోహదం చేసింది. తెలంగాణాలో ఊరూరా తన కవితా గర్జన వినిపించాడు. ఎందరో యువకులకు స్ఫూర్తి కలిగించాడు. 'ఆకాశవాణి' లో ఉద్యోగిగా.

—రెంటాల
'స్వాతి' వార పత్రికలో

## ఆ రోజులు

1921 లో: అవి సహాయ నిరాకరణ ఉద్యమం రోజులు. అప్పుడు

పంజాబు దురంతములు జరిగినవి. ఆ సందర్భంలో కాంగ్రెసు కమిటీ తరఫున మోతీలాల్‌గారు వాటి గురించి, విచారణ చేయాలంటే బ్రిటిషు గవర్నమెంటు చేయలేదు. కాంగ్రెసే నెహ్రూ కమిటీని ఏర్పాటుచేసి పంజాబులో ఏమేమి జరిగిందో దానిగురించి పెద్ద రిపోర్టు తయారు చేసింది ఇంగ్లీషులో ....గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు ఉద్యోగం మానేశారు. గుంటూరులో చాలామంది ఉద్యోగాలు మానేశారు. పెద్ద పెద్ద లాయర్సు ప్రాక్టీసు మానేశారు. మళ్ళా ప్రాక్టీసు లేనివారు కాదు. హయ్యెస్ట్ ప్రాక్టీసు ఉన్నవారు మానేశారు. గుంటూరులో కొండా వెంకటప్పయ్య పంతులుగారు, గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, బారిస్టర్ ఉన్నవ లక్ష్మీనారాయణగారు తరువాత బెజవాడలో కాళేశ్వరరావుగారు, బ్రీఫ్‌లెస్ వాలాస్ కాదు మానేసినది. లింగరాజుగారు, తరువాత కాకినాడలో బులుసు సాంబమూర్తిగారు కూడా ప్రాక్టీసు లేక మానేసినవారు కారు. రేపు పరీక్ష పాసై ప్రాక్టీసు చేద్దామనుకున్న ఎన్. ఎస్. వరదాచారి, నేను, తెన్నేటి విశ్వనాథంగారు ఆయన పెద్ద లాయరు. వి. వి. గిరిగారు పెద్ద లాయరు. ఆయన బారిస్టరు. ఆయన కూడా మానేశారు. ఆయన తండ్రి జోగయ్యపంతులుగారు. వారి యింటికి వెళ్ళడం భోజనాలు చేయడం. ప్రకాశం గారి వెంట తోకలా నేను కూడా వెళ్ళేవాడను.

బారు గోవిందరావు
'గాంధీ క్షేత్రం'లో








## హెలికాపరు

భారత - అమెరికన్ సంయుక్త పథకం క్రింద 'నారాస్ ఏవియేషన్' సంస్థ తయారుచేసే హెలికాప్టర్లలో మొట్టమొదటిది ఈ సంవత్సరాంతానికి మద్రాస్ ఎగుమతి ప్రాసెసింగ్ జోన్ నుంచి ఆకాశంలోకి ఎగురుతుంది. ఈ పథకం క్రింద తొలిదశలో ఒక అయిదు సీట్ల హెలికాప్టర్ని, ఒక రెండు సీట్ల హెలికాప్టర్ని తయారు చేయాలని నిర్ణయించి నట్టు వెల్లడించారు. అమెరికాకు చెందిన 'బ్రాంట్లే హెలికాప్టర్స్' సంస్థ డిజైన్ గల ఈ హెలికాప్టర్లను అతిముఖ్యమైన వ్యక్తుల ప్రయాణాలకు, స్థల సందర్శనకు, పోలీస్ గస్తీకి, ఆపదలో చిక్కుకున్న వారిని రక్షించే కార్యక్రమాలకు, సినిమా షూటింగులకు, పంట పొలాలపై క్రిమి సంహారక మందులు చల్లడానికి వినియోగించవచ్చు. 'బ్రాంట్లీ 305' రకం హెలికాప్టర్లో అయిదుగురు కూర్చొనడానికి వీలుంటుంది. ఇది గంటకు 120 మైళ్ల గరిష్ఠ వేగంతో ప్రయాణించ గలుగుతుంది. కాగా 'బి – 2బి' అనే మరొక రకం హెలికాప్టర్ రెండు సీట్లు కలిగివుండి, గంటకు 100 మైళ్ల గరిష్ఠ వేగంతో ప్రయాణించ గలుగుతుంది. తొలి దశలో తాము జరిపే హెలికాప్టర్ల నిర్మాణం దాదాపు విడి భాగాలను జతకూర్చడం మాదిరిగా వున్నప్పటికీ పూర్తి నాణ్యత కోసం ఈ కార్యక్రమాన్నంతటినీ అమెరికన్ నిపుణులు పర్యవేక్షిస్తారు. ఈ హెలికాప్టర్లను పూర్తిగా ఇండియాలోనే తయారుచేసేందుకై తమ సంస్థకు లైసెన్సు లభించగలదన్న ఆశాభావాన్ని 'శారోస్' అధ్యక్షుడు వ్యక్తం చేశారు. ఇండియాలో నిర్మితమయ్యే ఈ హెలికాప్టర్ల పట్ల ఇటలీ, టర్కీ, ఆస్ట్రేలియా, బ్రిటన్ ఆసక్తి చూపుతున్నాయి. అమెరికానుంచి తెచ్చిన ఈ రకం (అయిదు సీట్ల) హెలికాప్టర్ని విలేకరులకు, ఇతర ఆహ్వానితులకు ప్రదర్శించి చూపారు.

## కలంకారీ

కోణార్క్ - కట్టడంలో గానీ, తాజ్ మహల్ కట్టడంలో గానీ ఎక్కడా సిమెంట్ వాడలేదు. అయినా ఈ రోజు మనం సిమెంటు కొరత

కారణంగా బాలా భవనముల నిర్మాణము ఆగిపోవడం చూస్తుంటాము. ఎప్పుడైతే మనం ఏదైనా క్రొత్త దానిని చూస్తామో, అదే పనికి అంతకు ముందు నుండీ ఆచరణలో ఉన్న వాటిని గురించి మరచిపోయి క్రొత్త దానిపై మోజు పెంచుకోవడం సహజమై పోయింది. కలంకారీల కథ కూడా ఇలాంటిదే. ఈ కళారూపము బాలా ప్రాచీనమైనది. అనేక శతాబ్దాల వెనుకటిది. ఇది ప్రభుత్వపు సహాయం పొందినా, కొన్ని చౌక ప్రత్యామ్నాయాలు ఈ కళని ఒక మూలకు త్రోసి పుచ్చుటచే అభివృద్ధి చెందలేక పోయినది. అంతేకాక ఈ కళకు బహుళ ప్రజాదరణ లభించలేదు. దీని గురించి బాలా తక్కువమందికే తెలుసు. ఈ కలంకారి కళలో గుడ్డపై మొదట చిత్రాల నమూనాలు గీసి ఆ తరువాత వాటిని రంగులతో నింపుతారు. చిత్రాలు వేయుటకు కొందరు 'కలము' ను మరికొందరు 'బ్లాకులు' ఉపయోగిస్తారు. కలంకారి పుట్టుక బాలా సందేహాలతో కూడుకొని యున్నది. ఒక నిర్దిష్టమైన అవగాహన లేదు. కొందరు ఇది మచిలీపట్టణంలో ఆవిర్భవించినదని, మరికొందరు తిరుపతి సమీపంలోని శ్రీ కాళహస్తి దీని జన్మస్థలంగ అనీ వాదిస్తారు. ఈ కలంకారి కళలో పర్షియన్ కళకు సంబంధించిన కొన్ని అంశాలు స్పష్టంగా కన్పిస్తాయి. కాబట్టి ఈ కళను ముస్లిం రాజులు ప్రవేశపెట్టారనే వాదన కూడా ఉన్నది. ఈ కలంకారి పుట్టుక ఏది ఏమైనా, ఈ కళ మహోజ్జ్వలమై కనుల నాకర్షించు విధంగా ఉంటుంది. ప్రస్తుతం, చీరలు, బెడ్‌షీట్లు, గోడకు వ్రేలాడదీయు పటాలు మొదలగునవి ఈ విధానం ద్వారా రూపొందించబడుచున్నవి. సాధారణంగా ఈ కలంకారి కళాకారులు వేదాలు, పురాణాలలోని చిత్రాలను చిత్రించడానికి ఎక్కువ మక్కువ చూపుతారు. ఈ చిత్రలేఖనము చేతితో అతి జాగ్రత్తగా గీయబడుతుంది. దీనికి ముతక బట్టనుపయోగిస్తారు. మొదట ముతక బట్టను ఆవుపేడ నీళ్లలో నానబెట్టి తరువాత మరల, కరక్కాయనీళ్లలో నానబెడ్తారు. ఈ విధానము గుడ్డను తెల్లగా మెరిసేలా చేస్తుంది. డిజైనులు వేయడంకోసం సాధారణంగా ఉపయోగించే రంగులను 'గుల్మాల' నుండీ (మృదువైన మొక్కలు - వేర్లు) తీసి బెల్లంతో కలుపుతారు. ఈ విధానం బాలా శ్రమతో కూడినది కావడంచేత కళాకారుడు ఒక రోజులో ఒక మీటరు గుడ్డను మించి రంగించలేడు. ఈ విధంగా రంగించిన గుడ్డను శుభ్రమైన నీళ్లలో నాన్చి జాగ్రత్తగా ఎండబెడ్తారు. ఎండిన తరువాత గుడ్డను నీళ్లతో వున్న రాగి పాత్రలో వేసి కొన్ని రకాల చెట్ల బెరడు, ఆకులతోపాటూ ఉడకబెడ్తారు. ఈ విధానం ఎక్కువ సమయంతో కూడుకొన్న ఫలితంగా ఈ కలంకారి ఉత్పత్తుల ధరకూడా అధికంగా ఉంటుంది. అందుచే సామాన్య మానవుడికి ఇవి అందుబాటులో ఉండవు. వీటిని కొన్నవారు

మాత్రము ఇవి తమ హోదాకు చిహ్నాలు అని తృప్తిపొందుతారు.

## కాష్ ఎందుకు?

అమెరికా క్రమేణ ద్రవ్య రహిత సమాజంగా మారుతున్నదని పండితులు, ఆర్థికవేత్తలు కొన్ని సంవత్సరాల క్రితం నుంచి ఊహిస్తూనే వున్నారు. కాగా, ఇప్పటి పరిస్థితిని బట్టి చూస్తే - వారి అంచనాలు నిజమవుతున్నాయేమోనన్న అభిప్రాయం కలుగక మానదు. అమెరికాలో 'నగదు' అనేది ఎప్పటికీ అదృశ్యం కాక పోయినా ఇప్పుడక్కడ దేశవ్యాపంగా పెక్కు చిల్లర దుకాణాలలో డాలర్లకు బదులు 'టెల్లర్ మెషీన్ కార్డు' లను అంగీకరిస్తున్నారు లక్కీ స్టోర్స్ ఇన్ కార్పొరేటెడ్ అనే ఒక సూపర్ మార్కెట్ వ్యవస్థ కాలిఫోర్నియాలోని తన 386 దుకాణాలలో మూడు వందలలో ఈవిధమైన క్యాష్‌లెస్ చెల్లింపులను అనుమతిస్తున్నది. కాగా, నగదుతో పని లేకుండా 'టెల్లర్ కార్డు'ల ద్వారా క్రయవిక్రయాలు ఎక్కువగా పెట్రోలు బంకులు, దుకాణాలు, సూపర్ మార్కెట్లలో జరుగుతున్నాయి. 'ఎక్సాన్ కార్పొరేషన్' అనే సంస్థ 1986 లో తొమ్మిది రాష్ట్రాలలో సుమారు 2,000 సర్వీస్ స్టేషన్లలో ఎలెక్ట్రానిక్ పేమెంట్ టెర్మినల్స్‌ను ఏర్పాటు చేసింది. "మెబిల్ ఆయిల్ కార్పొరేషన్" సర్వీస్ స్టేషన్లలో ఏర్పాటు చేసిన 110 టెర్మినల్స్ వాషింగ్టన్ - బాల్టిమోర్ ప్రాంతంలో నెలకు సుమారు 27,000 ట్రాన్సాక్షన్స్ జరుపుతాయి.

## భిలాయ్

సరిగ్గా 33 సంవత్సరాల క్రితం 1955 ఫిబ్రవరి 2వ తేదీన భిలాయ్ ఉక్కు కర్మాగారం నిర్మాణంపై భారత - సోవియట్ యూనియన్ దేశాలమధ్య తొలి ఆర్థిక ఒప్పందం కుదిరింది. ఉభయ దేశాల మధ్య పరస్పర లాభదాయకమైన బహుముఖ ఆర్థిక, సాంకేతిక సహకారానికి యీ ఒప్పందం నాందీవాచకం పలికింది... ఏ వర్ధమాన దేశంలోనైనా ఉక్కు పరిశ్రమ, స్వావలంబన సాధించాలన్న ఆ దేశ ప్రజల ఆకాంక్షలకు చిహ్నాప్రాయంగా వుంటుంది. ఒక పటిష్టమైన ఉక్కు పారిశ్రామిక రంగం ఏర్పడటం భారతదేశానికి అత్యంత ప్రాధాన్యంగల విషయం. భారత దేశం స్వాతంత్ర్యానంతరం స్వయం సమృద్ధి, స్వావలంబన సాధించడంలో ఎంతో ప్రగతి గడించింది. భిలాయ్, బొకారో ఉక్కు కర్మాగారాల్లో విస్తరణ కార్యక్రమం పూర్తి అయిన తర్వాత, విశాఖపట్టణంలో ఉక్కు కర్మాగార నిర్మాణం పూర్తి అయిన తర్వాత దేశంలో ముడి ఉక్కు ఉత్పత్తి 17.5 మిలియన్ టన్నులకు చేరుకుంటుంది. భిలాయ్ ఉక్కు కర్మాగారం చురుకుగా దేశంలో అత్యంత ఉత్పాదకతగల జవహర్ లాల్ నెహ్రూ దీనిని భారతదేశపు ఆధునిక ఆలయమన్నారు.

అతి రుచికరమైనది

# క్రేన్

వక్కపొడి

దీనికి సాటి మరొకటి లేదు















# కొత్త పుస్తకాలు

"ప్రేమకోసం - భూమి కోసం" (నవల). మూలం : యషార్ కెమాల్. అనువాదం : కొండేపూడి లక్ష్మీనారాయణ. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు. వెల : రు. 10-00.

కాంగ్రెసు చరిత్రతో పెనవేసుకొని పోయిన భారత స్వాతంత్ర్య పోరాట గాథలో ఒక నల్లని మరకవంటిది 'ఖిలాఫత్' వుద్యమానికి యిచ్చిన మద్దతు. సంస్కరణలతో అభ్యుదయం వైపు టర్కీని నడిపించే ప్రయత్నం చేస్తున్న కెమాల్ పాషాకి వ్యతిరేకంగా నడిచిన వుద్యమమిది. దాని మాట అటుంచి, టర్కీలోని భూస్వామ్య వ్యవస్థ క్రింద నలిగిన ప్రజల కడగండ్లను గురించి చెప్పే యీ నవల చదువుతూంటే వారి జీవితాలకూ మనకూ వున్న పోలికలకు ఆశ్చర్యం వేస్తుంది.

టర్కీలో కానీ, చంబల్ లోయలో కానీ ఒక పౌరుడు బందిపోటుగా మారి అడవుల్లోనూ కొండల్లోనూ సమాజ నాగరికతకి దూరంగా రహస్య జీవితం కొనసాగిస్తున్నాడంటే, దాని వెనక సమాజం అతనికి చేసిన అన్యాయమే కారణం అయివుంటుంది. చంబల్ లోయలో బందిపోట్లుగా మారిన వారిలో ఎక్కువ మంది గ్రామాల్లో వారి చిన్న భూఖండాలు గ్రామ పెత్తందారులో, భూస్వాములో కబళించడం వల్ల న్యాయస్థానాల్లో వారికి న్యాయం చేకూరే అవకాశం ఏమాత్రం లేకపోవడం వల్ల వారు అమాదిరిగా అయ్యారు.

ఈ నవలలో మహమ్మద్ తన తల్లితో కలిసి సాగు చేసుకునే కాస్త చెక్కనూ, భూస్వామి ఆగా స్వాధీనం చేసుకోవడమే కాకుండా, తల్లీకొడుకులను జీతం బత్తెంలేని బానిస నవుకర్లుగా వుపయోగించుకుంటాడు. గ్రామంలోని మిగతా ప్రజల స్థితీ యిం తకంటె మెరుగయినదేమీ కాదు. మహమ్మద్ చిన్నతనం నుండీ తిరుగుబాటు మనస్తత్వం కలవాడు. ఒకసారి పారిపోయి ప్రక్కవూరి పెద్దమనిషి సులేమాన్‌తో అంటాడు." ........ పిల్లల్ని కొట్టారట. పిల్లల చేత బం వంతాన పొలాలు దున్నించరట. అ వూళ్లో ముళ్ళకంపలు పెరగవట అందుకని నేను ఆ వూర పోతున్నాను."

వీటికితోడు మహమ్మద్ ప్రేమించిన హాచీ అనే అమ్మాయిని, ఆగా బం

వంతాన తన మేనల్లుడికి యిచ్చి పెళ్ళి చేయాలని చూస్తాడు. మహమ్మద్, హాచీని తీసుకొని పారిపోవాలని ప్రయత్నిస్తాడు. అగా తన అనుచరులతో వచ్చి చుట్టుముడతాడు. జరిగిన కాల్పులలో అగా మేనల్లుడు వెలీ మరణిస్తాడు. అగాకి దెబ్బలు తగులుతాయి. మహమ్మద్ కొండల్లోకి పారిపోతాడు; హాచీని జైలుకు పంపుతాడు అగా.

కొండల్లో, గుహల్లో వుండే బందిపోటు ముఠాలతో చేతులు కలిపినా మహమ్మద్ చివరివరకూ ప్రేమకోసం, భూమికోసం, పరితపిస్తాడు. తన స్వగ్రామం దెయర్ మెనోలుర్‌లో ప్రజలకు స్వంత భూములు ప్రసాదించాలనే ఆకాంక్షతో, ప్రభుత్వం అమ్నెస్టీ (క్షమాపత్రం) జారీ చేశాక గ్రామంలో ప్రవేశించి, అగాను చంపేసి ప్రజలకు విముక్తి కలగజేస్తాడు. పోలీసు కాల్పులలో హాచీ, కొడుకూ మరణిస్తాడు. మళ్ళీ డేగల కొండలలోకి పోయి అంతర్థానమవుతాడు మహమ్మద్.

నవల చిన్నదైనా టర్కీ దేశపు గ్రామాల్లోని సామాన్య ప్రజల ఆచార వ్యవహారాలూ, వారి చిన్ని చిన్ని కోర్కెలూ, ఆశలూ, రాళ్ళూ, ముళ్ళ కొంకలూతో నిండిన పొలాలు, చెమటోడ్చి పనిచేసి నాలుగు గింజలు పండించడానికి పడే శ్రమ, వారి ఆకలీ-ఋవన్నీ పాఠకుల మనసుకు తాకుతాయి. కథనం అంతా అత్యంత సహజమైన శైలిలో ఆ ప్రజల జీవితాలవలెనే నేలకు దగ్గిరగా నడుస్తుంది. ఎక్కడా కృత్రిమమైన వర్ణనలూ, నినాదాల భేషజాలు కనపడవు.

చెకుముకి రాయితో నిప్పు చేసుకునే స్థితిలోవున్న అప్పటి వ్యవస్థతో పోలిస్తే యిప్పుడు టర్కీలో గానీ మనదేశంలో గానీ ఎంత మార్పు వచ్చిందో అనిపిస్తుంది.

అనువాదం బాగుంది. 'భాయీ'ని మాత్రం కొన్నిచోట్ల 'బ్రదర్', 'అన్న', 'భాయీ' అని యిట్లా రకరకాలుగా అనువదించారు. మూల రచయిత యషార్ కెమాల్ గురించి రెండు వాక్యాలయినా ఎక్కడా లేకపోవడం కొంచెం బాధాకరమైన విషయం.

* * *

''సాహిత్య మీమాంస' - ప్రచురణ అసోసియేషన్ ఆఫ్ కాలేజ్ లాంగ్వేజ్ టీచర్స్, తమిళనాడు. కాపీలకు : డా॥ వి ఎమ్. నాయుడు, డి - 2, లయోలా కాలేజీ స్టాఫ్ క్వార్టర్స్, చూలమేడు హైరోడ్ - మద్రాసు - 94. ఒకొక్కటి వెల : రు 6 - 00.

ఆరు నెలల కొకసారి వెలువడే ఈ ప్రచురణ, మద్రాసు నగరంలోని వివిధ కళాశాలలలో బోధించే భాషా అధ్యాపకులు చేస్తున్న కృషి. తెలుగులో వుత్తమశ్రేణికి చెందిన విమర్శనాత్మక సాహిత్యాన్ని అందరికీ అందించాలనే సత్సంకల్పంతో యీ 'సాహిత్య మీమాంస' ను వెలువరిస్తున్నట్లుగా వారు చెబుతున్నారు.

ఈ వ్యాసాల్లో ఆధునిక, ప్రాచీన తెలుగు సాహిత్యాలకు సంబంధించినవీ భాషాశాస్త్రం గురించీ, ప్రాచీన తమిళ

సాహిత్యం గురించీ, పి. ఉమ, వి. మునిరత్నం నాయుడు, ఎస్ శమంతక మణి, వీరారెడ్డి, శాయి ప్రసాద్, జయ భారతి, జి. వెంకటస్వామి, వె వి. ఎస్ ఎస్. ఎన్. మూర్తి, కె వి రమణమ్మ మున్నగువారి రచనలు వున్నాయి.

అంతా సాహిత్య సంబంధమే కాకుండా లాటరీల గురించి కూడా ఒక వ్యాసం ఉంది.

'భాష' విషయంలో అందరూ ఒకే 'విధానం'అవలంబించలేదు. కొందరిది శిష్టవ్యావహారికమైతే మరి కొందరిది సరళ గ్రాంధికం, ఏమైనా చదవడానికి బాగున్నాయి.

ఈ "సాహిత్య మీమాంస" కు సంపాదకులు వై. వి. ఎస్. ఎస్. ఎన్. మూర్తి మీమాంసయే కాకుండా యండమూరి వీరేంద్రనాథ్ రచనల మీద ఎ.బి సాయిప్రసాద్ రచించిన అనుశీలనాత్మక విమర్శకు కూడా సానం కల్పించారు. ఉన్నత ప్రమాణాలుగల రచనలకు "సాహిత్య మీమాంస" సానం కల్పించగలదని ఆశిస్తున్నాము.

* * *

వరాలు (గేయకావ్యం) : రచన : డి. సుజాతాదేవి. ప్రచురణ : స్పందన సాహితీ సమాఖ్య, 26-162, బుట్టాయిపేట, మచిలీపట్నం- 521 001. వెల : రు. 8-00.

పేపర్లో ఆ మధ్య ఒక వార్త వచ్చింది. కర్ణాటకలోని ఒక వూళ్లో ఒక యువతి ఒళ్ళు కాలి చనిపోతుంది. దీనికి కారణం భర్త, అత్తమామలే అని తెలుసుకున్న ఆ వూరి ప్రజలంతా ఏకమై ఆ కుటుంబానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరిపి, పోరాడీ ఆ వూళ్లో ఆ కుటుంబానికి స్థానం లేకుండా చేస్తారు. చట్టానికి కళ్ళు లేకపోవచ్చు గాని ప్రజలకుంటాయి.

"ఈలాంటి ఆగడములిక సాగనీయమనుచు, వూరు నాడేకమై వరదయై పొంగె---" అంటూ యీ గేయకథ ముగించారు. సుజాతాదేవి. పండుగకి వరాలు పుట్టింటికి వస్తుందని ఎదురుచూస్తూ వుంటుంది తల్లి చిన్ననాటి అల్లరీ, ముచ్చటలూ నెమరు వేసుకుంటూ. అంతలో తండ్రి కబురు తెస్తాడు, వరాలు వురివేసుకొని చనిపోయిందని! వరాలు చివరి వుత్తరంలో తనది పంజరపు బతుకయిందనీ, భర్త, అత్తమామల ఆశలకూ, కోర్కెలకూ అంతులేదనీ, అందుకే శాశ్వతంగా సెలవు పుచ్చుకుంటున్నాననీ వ్రాస్తుంది. అవి అక్షరాలు కావు "అతివ కన్నీళ్ళు.... కడగళ్ళు."

పూర్ణమ్మ, కిన్నెరసాని, స్నేహలత (రాయప్రోలు), యిప్పుడు వరాలు - కన్నీరు కురిపించే కావ్యాలు - ఆ నాయికలు ఆయాకాలాల్లో ఆడపిల్లలకు జరిగిన, జరుగుతున్న దురాగతాలకు ప్రతినిధులు. బాధనీ, దుఃఖాన్నీ కూడా సుతిమెత్తని మాటలతో చెప్పగల ప్రతిభావంతులు సుజాతాదేవి. "నిదురబోతే కలలు నిలువునా ఒణికించు, మెలకువొస్తే గుండె భయంతో అల్లాడు.

సరోజినీ ప్రేమ్‌చంద్

రాజ్ కమల్ ఫిలింస్ ఇంటర్నేషనల్
సమర్పించు




కమల్ హాసన్
సురేష్ కృష్ణ
ఇళయరాజా
రాజశ్రీ

# డైరీ

మార్చి 5, 1988

"ఆదర్శాలు వుండగానే సరిగాదు- వాటిని ఆచరణలో పెట్టగల అవకాశం కూడా వానగూడాలి.... స్పార్టకస్ కాలంనుంచీ సంఘంలో బల ప్రదర్శ నకి ఒక స్థానం ఉంటూ వుంది. అయితే, అది పశుబలంగాక రక్షణ కవచమైనప్పుడే గుర్తింపు నొందు తోంది," - అన్నారు కమలహాసన్, సవేరా మినీ కాన్ఫరెన్స్ హాలులోని ప్రెస్‌మీట్ సందర్భంగా. తమిళంలో విజయం సాధించిన 'సత్యా' చిత్రాన్ని 'సత్య సందేశం' అనే పేరుతో, తెలుగులో (రాజశ్రీ) విడుదల చేస్తున్నారు. కమలహాసన్, అమల యిందులో ముఖ్యులు; శివరంజని, ఢిల్లీ గణేష్ మున్నగువారున్నారు. 'రాజ్‌కమల్ ఫిలింస్ ఇంటర్నేషనల్' నిర్మించిన ఈ సంచలనాత్మక చిత్రానికి దర్శకులు: సురేష్ కృష్ణన్.... హాలీవుడ్‌లో మాదిరి, ఒక నటుడు ఒక చిత్రం పూర్తయాక గాని మరొక చిత్రంతో నటించకుండా వుండటంవల్ల కళాత్మక విలువ పెరుగుతుందనే కమలహాసన్ సూచన చాలా బావుంది. నటులతో బాటే మిగతా సాంకేతిక నిపుణులకి కూడా కొంచెం ఊపిరి పీల్చుకొనే వ్యవధి ఉంటుంది; కొత్త ప్రయోగాల పట్ల అనక్తి కలుగుతుంది. కళకు మేధస్సూ హృదయమూ కావాలి - కంప్యూటర్ వల్ల అయేపని కాదది.

. . . . . 06

"సినీరంగంలోకి వచ్చినవారు ఒక పక్షాన అది వొదిలి వెళ్లలేరు కాని, శంకరాభరణం మంజుభార్గవి మాత్రం తను నాట్య కళకే అంకితమవాలని నిశ్చయించుకొని, ఆ వెలుగు జిలుగుల ప్రపంచం వొదిలేసి నాట్యకళకు వన్నె తెస్తోంది" - అన్నారు ఫిలిమ్ ఛాంబర్ అధ్యక్షులు వెంకటేశ్వరన్, 'కళారంజని' వారు రాణీ సీతయ్ హాలులో ఏర్పరిచిన కూచిపూడి నాట్యప్రదర్శన సందర్భంగా. 'కళారంజని' అధ్యక్షులు రమణయ్య రాజా, తమ సాంస్కృతిక సంస్థ ముప్ఫయి సంవత్సరాలుగా లలితకళల అభివృద్ధికై కృషి చేస్తోందన్నారు. ఇక మంజుభార్గవి నాట్య ప్రదర్శన ఎంత రమణీయంగా రస ప్రపూర్ణంగా ఉన్నదంటే 'మరకతమణి మయదేలా' చేస్తున్నప్పుడూ, సత్యభామ విరహం కరచరణాలు నేత్రయుగళి

భావదీప్తితో వెల్లడిస్తున్నప్పుడూ, అన్నమయ్య పలుకుతీపి పదకవితా పారిజాతంలా సామాజికులని మెప్పిస్తున్నప్పుడూ తన విద్యా కౌశలంలో లీనమై ప్రేక్షకులని పరవశింప జేసింది. చూపువాసి పొడగరి అయినప్పటికీ ఆ విగ్రహంలో లావణ్యరేఖలు వెదజల్లే సౌకుమార్యం ఉంది.... నట్టువాంగం: వెంపటి చినసత్యం; గాత్రం: కనకదుర్గ.

. . . . 08

"తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవ్వరు?" అని ప్రశ్నించారు శ్రీశ్రీ. ఆ కూలీవర్గానికీ పెట్టుబడిదారులకీ మధ్య జరిగే ఘర్షణే ఈ కథ" - అన్నారు చిత్రకథా రచయిత భీశెట్టి లక్ష్మణరావు - 'గుడ్‌లక్'తో సాయికిరణ్ వారి 'కూలీ' చిత్రంలోని గీతమాలిక ప్రదర్శనానంతరం. అరవై కథలు విన్నమీదట దీనిని ఎంపిక చేశారట నిర్మాతలు ... అరుణ్, అర్చన, రమ్యకృష్ణ, నూతన్‌ప్రసాద్, సుధాకర్, కోటశ్రీనివాసరావు, కాంచన మున్నగువారున్న ఈ చిత్రం త్వరలోనే విడుదల కానున్నది. "శ్రావణ సంధ్యారాగంలో సప్తవర్ణాల తాళంతో..." (వేటూరి రచన - బాలూ సుశీలల గాత్రం) ఎంతో శ్రావ్యంగా, వినసొంపుగా ఉంది. డిస్కో డిస్కోల మధ్య అది వసంత సమీరం. దర్శకత్వం: చక్రవర్తి. నిర్మాత: గోగినేని ప్రసాద్.... భారతీయ విద్యా భవన్‌లో, చిత్రావిశ్వేశ్వరన్ శిష్యురాండ్రయిన ప్రియా శ్రీధర్, దీపా అద్వానీల భరతనాట్య ప్రదర్శన. హెూ అండ్ కంపెనీ ఎంబెరుమన్నార్ చెట్టిగారి కోడలు ప్రియాశ్రీధర్. ఇద్దరు యువతులూ 'భావయామి'...చేస్తున్నప్పుడు రామాయణ రసవద్ఘట్టాలు ప్రేక్షకుల ముందు నిలిచాయి; అలాగే చిదంబర నాథుడైన నటరాజుని స్తుతిస్తున్నప్పుడు కూడా! మన సంస్కృతిలోని సంగీత నాట్యకళలు శివవైష్ణవుల పూజార్పితం... ప్రియాశ్రీధర్, దీపా అద్వానీ యిరువురూ భరతనాట్యంలో సుశిక్షణ పొందిన సుందరీమణులు.... నట్టువాంగం: చిత్రా విశ్వేశ్వరన్. గాత్రం: విశ్వేశ్వరన్, రాజశేఖరన్.

. . . . . 12

"వర్క్ చేయని వర్క్‌షాపులూ, గమ్యంలేని సెమినార్లూ మన జీవితంలో ఒక భాగమై పోయాయి. కళలకు సామాజిక గౌరవం లభించడంతో, కళ అనే మాటకు వర్ణక్రమం తెలియని కళాపోషకులూ, కళాభిజ్ఞతకు తామే వారసుల మనుకొనే కుహనా పండితులూ తయారవుతున్నారు.... ఇప్పుడు మనం హస్తకళాకోవిదులని సత్కరించేందుకు గాను సమావేశమయాము. ఉపన్యాసాలకిది సమయం కాదు - క్లుప్తంగా నాలుగు నిముషాల్లో ముగిస్తాను. కళా స్వరూపాలు విభిన్న సంస్కృతుల మధ్య భావసమైక్యతకు, పరస్పర మైత్రికీ దారితీస్తున్నాయి. 'సార్క్' లోని (SAARC) ఆరు దేశాలనుంచి వచ్చిన ఈ హస్తకళానిపుణులకు భౌగోళిక రాజకీయ సరిహద్దులు లేవు" - అన్నారు తమిళనాడు గవర్నర్ పిసి అలెగ్జాండర్.

రాజాజీ హాలులో, పదిహేను రోజుల పాటు లలిత కళా అకాడమీ ప్రాంగణంలో జరుగనున్న 'టెర్రాకోట్టా' (Terra Cotta) వర్క్‌షాపుకి ప్రారంభోత్సవం గావిస్తూ! పాకిస్తాన్, బంగ్లాదేశ్, మాల్దీవ్స్, నేపాల్, శ్రీలంక, ఇండియాలకు చెందినవారు యిందులో పాల్గొంటున్నారు- మొత్తం ముప్ఫయ్యిద్దరు.... హ్యూమన్ రిసోర్సెస్ శాఖ కార్యదర్శి వీరరాఘవన్ అధ్యక్షత వహించగా, సాంస్కృతిక శాఖ డైరక్టర్ లక్ష్మణరావు ఆహూతులకు స్వాగతం తెలిపారు; అదే శాఖ కార్యదర్శి, కాశీ రాజన్ ఈ వర్క్‌షాప్, 'సార్క్' దేశాలమధ్య, స్నేహసోపానమన్నారు: లలిత కళా అకాడమీ కార్యదర్శి రాజారామ్ వందన సమర్పణ గావించారు.... టీ అయాక జరిగిన కల్చరల్ ప్రోగ్రామ్‌లో మద్రాసు మ్యూజిక్ కాలేజీ విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్నారు.

. . . . . 14

"నీ వళే విరిజలు.... వలపుల వెల్లువ, వసంత వాకిలి, అభం శుభం తెలియని ఆడపిల్లని, వదలనురా-వలపునురా" ....'బావా మరుదుల సవాల్' (క్వాలిటీ పిక్చర్స్) లోని అయిదు పాటలు ప్రాతికేయులకు గుడ్ లక్‌లో చూపించారు. - శరత్‌బాబు రాజేంద్ర ప్రసాద్, రాజశేఖర్, జీవిత, రమ్య, కల్పనలపై (గాత్రం: వాణీ జయరామ్, సుశీల, జేసుదాసు, చిత్ర, రమేష్, ఆనంద్ - గేయ రచన: వేటూరి) ఆ అయిదూ చిత్రీకరించారు



అన్నమాచార్య భావనా వాహిని అధ్వర్యంలో తాళ్లపాక అన్నమాచార్య 485 వ వర్ధంతి ఉత్సవాలు హైదరాబాదు త్యాగరాయ గాన సభలో మార్చి 15 న వైభవంగా జరిగాయి. స్వామి రంగనాథానంద తమ ప్రసంగంలో శోభారాజు వంటి కళాకారులను సాంస్కృతిక రాయబారులుగా, శాంతికి వారధులుగా ఉపయోగించుకోవాలని అన్నారు. అలమేలుమంగపై ఆమె గానం చేసిన 'అన్నమయ్య ఆలాపనలో అలమేలుమంగ' అన్న క్యాసెట్టుని ఆవిష్కరించారు. నిత్య జీవితంలో మనకు తెలియకుండానే అన్నమయ్య కీర్తనలెన్నో లాలి పాటలై, దంపుళ్ల పాటలై పెనవేసుకు పోయాయని చెప్పారు జస్టిస్ అమరేశ్వరి.

పద్మజానాయుడు కథకు కాశీ విశ్వనాథ్ మాటలు. నిర్మాత: అప్పారావు; దర్శకత్వం: గణేష్.

## .15

''బయొకెమిస్ట్రీ పూర్తి వేసి నెలకు నూటఏభై రూపాయల స్కాలర్‌షిప్ మీద భవిష్యత్తులోకి చూస్తూండగా, కలకత్తా నుంచి 'పబ్లిక్ హెల్త్ సంబంధిత, సంయుక్త పథకం' వారి ఒక చిన్న ప్రకటన కళ్లబడింది. నెలకి మూడు వందల యాభై గనక వెంటనే అప్లయ్ చేశాను; ఇంటర్వ్యూకి పిలిచారు; భారీ విగ్రహం గల అ అమెరికన్ దొరగారు చెబుతున్నది నాకు సరిగా అర్థంగా నప్పుడు, దాక్షిణాత్య మిత్రుడొకడు సాయం చేశాడు. 'రానున్న పదేళ్లలో, ఈ వాతావరణ కాలుష్య సమస్య భారతదేశాన్నే కాదు - యావత్ ప్రపంచాన్ని పట్టి పీడిస్తుంది. నీవు ఉద్యోగం వెతుక్కోవడం కాదు, నిన్ను పిలిచి ఉద్యోగ మిస్తారు' - అని చెప్పాడా అమెరికన్. ఆ మాటలు నాలో ఆశాదీపాన్ని వెలిగించాయి. బెంగాల్‌లోని ఒక కుగ్రామంలో నా ఉద్యోగం. బెంగాలీ నేర్చుకున్నాను. బెంగాలీలో బాగా మాట్లాడటం నేర్చు కున్నాను. నా జాబ్ ఏమిటంటే అయిదుగురు పేద రైతుల ఇళ్లలో అయిదు మోడల్స్‌లోని సెప్టిక్ టాంకులు మా సంస్థ స్వంత ఖర్చు మీద నిర్మించి, అందులో ఏ మోడల్ ఈ వాతావరణానికి అనుగుణంగా ఉంటుందో సాంకేతిక అంచనాలతో తేల్చ డం - ఇది ఒక పరిశోధనా కార్య క్రమం. రైతుల సహకారమెంతదాకా నంటే, మా టెక్నికల్ డేటా సేకరణకు అడ్డు తగలకుండా వుండటం వరకు.... ఉపన్యాసం దంచేశాను - నోళ్లు వెళ్ల బెట్టుకు విన్న రైతులని, సందేహా లేమైనా వుంటే అడగమన్నాను. ఎవరూ మాట్లాడలేదు. కాని, చేతికర్ర రెండు చేతులతో పుచ్చుకు కూచున్న ఒక వృద్ధ రైతు, తనకో సందేహం ఉంద న్నాడు. అడగమన్నాను. 'బాబు, రెండు పూట్లా కడుపు నిండా తిండితినే యోగం లేని మాకు ఈ మరుగుదొడ్ల పథకం ఎందుకు?' - అని అడిగాడు. - 1955 లో ఆ బెంగాలీ రైతు వేసిన ప్రశ్న, నా గుండెలు పిండింది; నా పాదాల కిందున్న నేల జలదరించింది. అతని ప్రశ్నకు నావద్ద సమాధానం లేదు. ముప్పయి మూడేళ్లు గడిచినా, ఆ వృద్ధుని ముఖం, ఆ విజన్, యిప్ప టికీ నా కళ్ల ముందు తాండవిస్తోంది'' - అన్నారు, షికాగోలోని 'యాంటీ పొల్యూషన్ కమీషన్' లో (వాతా వరణ కాలుష్య నిరోధక శాఖ) ఉన్న తోద్యోగి అయిన తాతా ప్రకాశం, రాజాలక్ష్మి ఫౌండేషన్ రాజా గారింట్లో, సాయంత్రం చల్లబాటు వేళ. రేపురాత్రి ఆయన అమెరికా వెళ్లిపోతు న్నారు - అందుకని నలుగురైదుగురు మిత్రులని ఫోనులో పిలిచారు రాజా గారు.... 'యాంటీ పొల్యూషన్ పర్మిట్' ఏ పరిశ్రమ ప్రారంభానికైనా మనుగడకైనా ఎంత అవసరమో, వాతావరణ కాలుష్య నివారణ, ఒజోన్ పొర సంరక్షణ యిత్యాది విషయాలు ఆ వివరాలు ప్రేమ్‌చంద్, ప్రకాశమ్‌ల సంభాషణలో చోటుచేసుకున్నాయి.... ఏడేళ్లు ఇండియాలో ఉద్యోగంచేసి..

ఉన్నతావకాశాల కోసం అమెరికా వెళ్లారు తాతా ప్రకాశం.... ఎంతో సరదాగా, ఎన్నో కబుర్లతో గంటలు నిముషాలయాయి. ఇల్లు చేరుకొనేసరికి తొమ్మిది దాటింది.... ఎంతో సింపుల్‌గా కనిపించే రమణయ్య రాజాకు, అమెరికాలో ఎన్ని తెలుగు కుటుంబాలు సన్నిహితంగా తెలుసో, తలుచుకుంటు వుంటే ఆశ్చర్యంగా ఉంటుంది.

....20

ఎవియమ్ తొమ్మిదో ఫ్లోర్‌లో మహేశ్వరీ మూవీస్ వారి కొత్త చిత్రనికి ఉదయం ఎనిమిది గంటలకు ప్రారంభోత్సవం - చిత్రం పేరు 'చిక్కడు - దొరకడు' - మిత్రులూ పాత్రికేయులూ ముహూర్తానికివచ్చి, వెంకన్న బాబుకి శుభాకాంక్షలు తెలిపారు .... "ఇరవైమూడోఏట నెల్లూరు వి ఆర్ కాలేజీలో అధ్యాపకునిగా జాయినయాను. మూడున్నరేళ్లు వున్నానక్కడ. నెల్లూరు జిల్లాలోని పూర్వ పరిచితులు, ఉద్యోగరీత్యా నేను పొందిన స్థానాలకు ప్రశంసిస్తూ లేఖలు వ్రాసినప్పుడు, నా హృదయం హర్షాతిరేకంతో జలదరిస్తుంది. స్నేహసంస్కారాలలో తెలుగువారు అద్వితీయులు - వారి అభిమానం, ఆప్యాయత నేను ఎన్నటికీ మరువలేనివి..... ఇవ్వాళే చూడండి, ఏదో గోప్యంగా యింట్లో నాలుగు గోడల మధ్య జరగవలసిన జన్మదినాన్ని, మద్రాసు తెలుగు అకాడమీవారు ఒక పబ్లిక్ ఫంక్షన్‌గా మార్చి, నన్ను వుక్కిరి బిక్కిరి చేస్తున్నారు. వారి ఆదరాభిమానాలకు నా ధన్యవాదాలు.... ఈ అకాడమీ జాతీయ సమైక్యతకు దేశ సమగ్రతకు అంకితమైనందుకు నాకెంతో సంతోషంగా ఉంది.... ఎన్నో నాగరికతలు కాలగర్భంలో కలిసిపోయాయి. కాని, మనది అయిదువేల సంవత్సరాలు అవిచ్ఛిన్న సంస్కృతి. ఈ భరత భూమి ఆదినుంచీ 'యూనిటీ' కై (భిన్నత్వంలో ఏకత్వం) కృషి చేస్తున్నదిగాని 'యూనిఫార్మిటీ' (ఒకే



తెలుగు తమిళ సినీ చరిత్రలోనే కాదు, ప్రపంచం మొత్తం మీద 'గ్లామర్ వరల్డ్' లో ఏభై సంవత్సరాల పాటు, తన ప్రత్యేకస్థానం నిలబెట్టుకున్న ప్రతిభావంతురాలు భానుమతి ఒక్కరే! అర్థశతాబ్దినాటి మధుర విషాద కాళింది ('వరవిక్రయం') నుంచి, నేటి 'అత్తగారు' దాకా ఆమెకుసాటి మరొకరు ఎవరూ లేరు.

వరవడి) కోసం కాదు. అదే మన సంస్కృతికి వున్న బలమూ జీవమూను. శిల్పంలోను, నాట్యంలోను, లలితకళల లోను మాత్రమే మన సాంస్కృతిక వారసత్వం ఉన్నదని అనుకోవద్దు. సంస్కృతిని వెల్లడిచేసే రూపాలు మట్టుకే అవి. అసలైన సంస్కృతి ప్రజలలో, ప్రజలు పాటించే సామాజిక ధార్మిక విలువలలో, అనుశ్రుతంగా అవలంబించే పద్ధతులలో జీవవాహినిలా విలసిల్లుతోంది.... ఒక జాతి చరిత్రలో నలభై సంవత్సరాలు బాలా స్వల్ప కాలం. స్వాతంత్ర్యం పొందిన దేశాలన్నిటి కంటె మనం ఎంత మెరుగ్గా వున్నామో పరిశీలించి చూస్తే, మన డెమొక్రసీ, మన సెక్యూలరిజమ్ సాధించిన ప్రగతి బోధపడుతుంది" -అన్నారు తమిళనాడు గవర్నరు పి సి అలెగ్జాండర్, మ్యూజిక్ అకాడమీలో జరిగిన 'ఉగాది వెలుగుల' ఉత్సవ సందర్భంగా.... నిన్న భారత రాష్ట్రపతి వద్ద నుంచి గౌరవసత్కారం పొంది (రాత్రి టివిలో చూసివుంటారు). ఈ ఫంక్షన్ కోసమని తిన్నగా ఢిల్లీ నుంచి వచ్చిన పద్మభూషణ్ అక్కినేని నాగేశ్వరరావు, ఈ మద్రాసు మహానగరం తనను ఎలా తీర్చిదిద్దినదీ, పిల్లల చదువు కోసం 1963 లో హైదరాబాదుకి మకాం మార్చినప్పటికీ, వారానికోసారి రావటమో, నెలకు వారం పదిరోజులు యిక్కడ వుండటమో జరుగుతోందన్నారు.... "1944 మే 8వ తేదీన నేను మద్రాసు వచ్చాను.... చెప్పులు లేకుండా నడచిన రోజులు వున్నాయి .... కష్టపడ్డాను, శ్రమ ఫలించింది .... ఈ అకాడమీ ప్రారంభం నుంచీ ప్రతీ సంవత్సరం ఉగాది ఉత్సవానికి వస్తూనే ఉన్నాను. .... సంగీత నాట్యాల ద్వారా శాస్త్రిగారూ ఆయన కార్యకర్తలూ జాతీయ సమైక్యతా ధ్యేయంతో చేస్తున్న కృషిని యావద్భారతం మెచ్చుకుంటోంది" - అన్నారు పద్మభూషణ్ అక్కినేని నాగేశ్వరరావు. మూడు గంటల ముప్ఫయి మూడు నిముషాలకు పళనిస్వామి నాద స్వరంతో ప్రారంభమయింది ఉగాది వెలుగుల కార్యక్రమం. విశ్వావిశ్వేశ్వరన్ జ్యోతి వెలిగించగా, అశ్వనీరోహిణులు పంచాగశ్రవణం గావించారు. తర్వాత కవితాగోష్ఠి. వాయువుకీ కాలానికీ ఆద్యంతాలు లేవనీ, చైతన్య మందిరంలో వుండేవి సత్యమ్ శివమ్ సుందరమ్ అనీ రసభావపుష్టి గల కవిత చదివారు సాయికృష్ణ యాచేంద్ర. ప్రప్రథమ విప్లవనారి శకుంతల, ఆమె కుమారుని( భరతుడు) సంతతికి చెందినది ఈ దేశం - అన్నారు వెరువు అంజనేయశాస్త్రి. మొదలి శ్రీరామప్రసాద్, ఉపద్రష్టసాయి, కోటేశ్వరరావు 'విభవ'ను ఆనందంతోను ఆక్రోశంతోను ఆహ్వానించగా, ఎంతో వొదిగి కూచున్నట్టుగా కనిపించిన అనూరాధ, తన కవితలో అగ్ని నాలుకలు ఝళిపించి, శ్రోతలను స్పందింపజేశారు.... తర్వాత లలిత సంగీతంలో వసంత, జ్యోతిర్మయి, శైలజ, సునంద, వసంతలక్ష్మి, రాధిక, జయదేవ్, ప్రకాష్‌లు పాల్గొన్నారు. నిర్వహణ : ఆనంద్....

ఆ తర్వాత అల్లరి' అనే హాస్య రూప కంతో సూర్యకాంతం, రమాప్రభ, రాధాకుమారి, పొట్టిప్రసాద్, పద్మ నాభం రావికొండలరావు సభికులని నవ్వించారు. కూచిపూడి, భరత నాట్యం, తిల్లానా - మూడు అయి టమ్స్ మణిపూసల్లా, ప్రేక్షకులని రసానందలహరిపై వూగిసలాడుస్తూ అనుపమ కరచరణ విన్యాసంతో ప్రద ర్శన యిచ్చింది మాళవిక (1986 ఏప్రిల్ జగతి' ముఖ చిత్రం).... నవరసాలలో శృంగారం గొప్పదా, హాస్యం గొప్పదా అనే వినోదాత్మక చర్చలో అక్కినేని, గొల్లపూడి పాలొ న్నారు. ఋతురాజు వసంతం, రస రాట్టు శృంగారం అవటం వల్ల, హాస్యం వెనకడుగువేయక తప్పదు. అయినప్పటికీ గొల్లపూడి మారుతీ రావు, 'బెట్టిడేవిస్, క్లార్క్‌గేబుల్' పాతికేళ్ల క్రితం యాక్ట్‌చేసిన 'కిస్సింగ్ సీన్' విషయంతో ఒక సేల్స్‌గరల్‌కి కలిగిన అనుభూతి, ఆ జ్ఞాపకం చాలా చక్కగా చెప్పారు. రజ్జుసర్ప భ్రాంతి అని వేదాంతులు చెప్పేది వెండితెర విష యంలో ఎంత నిజమో అనిపిస్తుంది. కవులని, కళాకారులని, గాయకులని యస్ జానకి సత్కరించగా, యింత వరకూ జరిగిన కార్యక్రమాన్ని రావి కొండలరావు, కుమారి మహతి నిర్వ హించారు. ఇకనుంచి యస్ పి బాల సుబ్రహ్మణ్యం....

మద్రాసు తెలుగు అకాడమీ అధ్య క్షులు ఓబుల్‌రెడ్డి, అపోల్లో హాస్పిటల్ పి సి రెడ్డి, రిచ్‌మన్ గ్రూప్ విఠల్,



మద్రాసు తెలుగు అకాడమీ నిర్వ హించిన విభవ ఉగాది ఉత్సవంలో పద్మభూషణ్ అక్కినేని నాగేశ్వర రావు నవరసాలలో శృంగారానికి గల ప్రథమ స్థానమెటువంటిదో గొల్లపూడి మారుతీరావుతో (హాస్యం) జరిపిన చర్చలో వివరించారు. ఒకనాటి 'బాల రాజు' నేటి 'ప్రేమ సమ్రాట్'

మ్యూజిక్ అకాడమీ వాసు, పద్మ భూషణ్ అక్కినేని, అలెగ్జాండర్ దంప తులు, అకాడమీ ఉపాధ్యక్షురాలు యస్ జానకి వేదికమీద ఆశీనులయాక, అక్కినేని అధ్యక్షోపన్యాసం. గవ ర్నరుకి ఓబుల్‌రెడ్డి, పద్మభూషణ్ వచ్చిన సందర్భముగా అక్కినేనికి అకా డమీ తరపున గవర్నరూ పూలమాల వేసి, పొన్నాడై (శాలువ) కప్పి కిరీట ధారణ గావించారు. ఆ తర్వాత, హాపీ బర్త్‌డే బృంద గానమూ కరతాళ ధ్వనులూ మధ్య గవర్నరుగారి ఉప

న్యాసానికి ముందు మద్రాసు తెలుగు అకాడమీ కన్వీనర్ టి వి కె శాస్త్రి, అలెగ్జాండర్ బహువర్ణమయ జీవితం లోని ప్రధాన ఘట్టాలూ, అధిరోహిం చిన శిఖరాలూ, అలంకరించిన పద వులూ, కార్యదక్షతతో సాధించిన విజయాలూ పొయిట్రీ చదువుతున్నట్టు చెప్పారు..... అవార్డ్ గ్రహీతలు ఒక్కరొక్కరిని బాలసుబ్రహ్మణ్యం వేదికమీదకు ఆహ్వానించగా, అలె గ్జాండర్ వారిని పుష్పమాలాలంకృ తులు గావించి, జ్ఞాపికలు అందజేశారు. అకాడమీ అవార్డులు అందుకున్న వారు ! మోటూరి సత్యనారాయణ, యమ్ ఎ యమ్ రామస్వామి, శాం తప్ప, డాక్టర్ శాంత (కాన్సర్ ఇన్ సిట్యూట్). 'హిందూ' అసోసియేట్ ఎడిటర్ రామ్, 'ఆంధ్రజ్యోతి' ఎడిటర్ నండూరి రామ్మోహనరావు, మృదంగ విద్వాన్ గోపాలకృష్ణన్, నాట్యకళా కారిణి మాళవిక, రంగస్థల నటుడు డిల్లీ గణేష్, కలంకారీ నిపుణుడు ముని కృష్ణన్ (అస్వస్థులుగా వుండటంవల స్వామీ రంగనాథానంద, అమెరికా నుంచి అనుకున్న టైముకి రాలేకపోయి నందువల్ల నార్ల తాతారావు ఈ ఉత్స వానికి రాలేకపోయారు).... ఒకరి స్మృత్యర్థం మరొకరు, అకాడమీ వేదిక మీద అందజేస్తున్న అవార్డులు ; త్యాగరాయస్వామి పేరిట ఓబుల్ రెడ్డి యిస్తున్న అవార్డ్ సెమ్మంగుడి శ్రీని వాసయ్యర్ ; పుల్లయ్య పేరుమీదుగా శాంతకుమారి యిస్తున్న అవార్డ్ కె జగ్గయ్య ; ద్వారం వెంకటస్వామి జ్ఞాపకంగా ఉమ్మడి నందగోపాల్ - వయొలిన్ గోపాలకృష్ణన్, కోదండ పాణి స్మృత్యర్థం బాలసుబ్రమణ్యం యిస్తున్నది - పి ఆదినారాయణరావు; పెండ్యాల పేరిట యస్ జానకి - పి సుశీల; సుబ్బరామన్ స్మృతిగా బాల మురళి - గాయత్రి: బియన్ రెడ్డి పేరు మీదుగా చంద్రమోహన్ యిస్తున్నది - సింగీతం శ్రీనివాసరావు; గాలి బాలసుందరరావు స్మృతిగా జలంధర- మణిరత్నం; రాజారావు పేరిట డియస్ చలం - రావుగోపాలరావు, శ్రీ శ్రీ జ్ఞాపకార్థం ఆరుద్ర యిస్తున్న అవార్డ్ - అజంతా, చిత్తూరు నాగయ్య పేరు మీద వి మోహనరావు -కాంతారావు; యస్వి రంగారావు పేరిట బొబ్బిలి రాజా - శరత్‌బాబు ; రేలంగి వెంక ట్రామయ్య పేరిట బి విశ్వనాధరెడ్డి - రమాప్రభ ; ఘంటసాల పేరిట యస్ రాజేశ్వరరావు - వియకె రంగారావు ; బళ్లారి రాఘవ పేరుమీద రమణయ్య రాజా - పసల సూర్య చంద్రరావు. ఈ పదిహేనుగురు గ్రహీతలు స్వయం గావచ్చి ఆయా అవార్డులు అందు కున్నారు.... మూడున్నరకి ప్రారం భమై తొమ్మిది గంటలకు ముగిసిన విభవ ఉగాది వేడుక - రసభూ యిష్ఠమూ రమణీయమూ అయిన ఈ కార్యక్రమం - మళ్లీ ఉగాది దాకా జ్ఞాపకం ఉంటుంది. మ్యూజిక్ అకా డమీలో కిందా పైనా ఒక్క కుర్చీ ఖాళీ లేదు సరిగదా, వింగ్స్‌లో నిలబడి చూశారు, మద్రాసులోని అంగ్ల దిన పత్రికల 'కవరేజ్' ఫంక్షన్ కొచ్చే అవ

కాశం లేనివారిని ఆశ్చర్యచకితులు గావించింది,.... 'మనదేముంది, సార్, మనని నడిపించేవాడు వేయిస్తున్నాడిదంతా' అనే శాస్త్రిగారి కుండే ఆత్మ విశ్వాసం, ఏకోన్ముఖ లక్ష్యం చిత్తశుద్ధి బహు కొద్దిమందిలో కనిపిస్తుంది.... మార్చి ఫంక్షన్ అయిపోయింది - ఇక మేనెలలో జరిగే జుగన్‌బందీలో నిమగ్నమై వుంటారాయన.... ఫిలిప్స్, రిచ్‌మన్ గ్రూప్ వంటి సంస్థలు యిటువంటి సాంస్కృతిక కార్యక్రమాలకు చేయూత నివ్వడం ఎంతో మెచ్చుకోతగ విషయం.



## 21

"తటాకంలో కమలాలూ వుంటాయి క్రిములూ వుంటాయి – కాని, ప్రవాహంలో వుండవు, నేను ప్రవాహ కవిని.... నన్ను కులపతి అనడంకంటె వైస్ ఛాన్సలర్ అంటే చెవికి ఇంపుగా ఉంటుంది.... సాధారణంగా ఉపన్యాసాలు రెండు రకాలు – విన్యాసాలతో సాగేవీ, సారం గలవీను.... జస్టిస్ కృష్ణయ్యర్ 'జాతి- ఉపజాతి' గురించి, జస్టిస్ మోహన్ 'భారత దేశంలో సాంఘిక న్యాయం' అనే అంశం గురించి, మోటూరి సత్యనారాయణ గారు 'గాంధేయ దృక్పదం' గురించి మాట్లాడారు.... నేను కవిని. రాజకీయాలూ, రాజకీయ వైఖరులూ నా పరిధిలోనివి కాదు.... పొట్టి శ్రీరాములు 87వ జయంతి మార్చి 16వ తేదీనైనా, నా కోసమని ఈ ఉత్సవం అయిదురోజులు ఆలస్యంగా జరుపుతున్నారు - శాస్త్రి గారూ శాంతప్ప గారూ నాపట్ల చూపిన అభిమానానికి కృతజ్ఞుణ్ణి. 'టాపిక్ ఆఫ్ యువర్ ఛాయిస్' అన్నారు. 'తెలుగు, తమిళ, హిందీ భాషలలోని సమకాలీన కవితా ధోరణులు' ప్రసంగ విషయంగా తీసుకున్నాను.... మనోభావాన్ని చెప్పేది భాష, కోతులు కిచకిచ లాడితే; మానవులు తమ మనసులో ఉన్నది

భాషారాష్ట్రాల ద్వారా జాతీయ సమైక్యత మరింత దృఢతరమవుతుందని నమ్మిన గాంధేయవాది పొట్టి శ్రీరాములు 87వ జయంతిని ఆయన పేరిట ఏర్పడ్డ స్మారక సమితివారు 1988 మార్చి 21వ తేదీన శ్రీనివాసశాస్త్రి హాలులో జరిపారు. ప్రధానవక్త నారాయణరెడ్డి, ఆధునిక కవితా ధోరణుల (తెలుగు, హిందీ, తమిళం) గురించి ప్రసంగించారు



వివిధానేకశబ్దాలలో చెబుతారు. భావ మెప్పుడూ శబ్దపంజరంలో బందీగాక తప్పదు. మానవ జాతులకంటె భాషల సంఖ్య ఎక్కువ. ప్రపంచం మొత్తం మీద అయిదువేల భాషలు వున్నాయి; అయితే ప్రపంచ జనాభాలో 95 శాతం నూరు భాషలు మాత్రమే మాట్లాడు తున్నారు. ప్రథమస్థానం చైనీయ భాషది; రెండవ స్థానం ఇంగ్లీషు; మూడు స్పానిష్ - ఫ్రెంచి, రష్యన్ యిత్యాదులు ఆ తర్వాత వస్తాయి. మన భారత దేశంలో 179 భాషలు, 544 మాండలికాలు వున్నాయి.... పొట్టి శ్రీరాములు కారణంగా భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడి, ప్రాంతీయతా వాదా నికి దారితీశాయనే అభిప్రాయం ఒకటి ఉంది. నా దృష్టిలో అది సహేతుకం కాదు. శ్రీరాములు గారు సిసలైన జాతీయతావాది. మాతృభాషా బోధన, మాతృభాషా వికాసం జాతీయతా దృక్పథాన్ని పటిష్ఠం చేస్తాయనే గాం ధేయ సిద్ధాంతాని కాయన బద్ధులు. 'బలి, దానము చేత అడుగున పడి నాడు - బలిదానము చేత పొట్టి శ్రీరా ములు పొడుగైనాడు' – అన్నారు నిడద వోలు వెంకట్రావు గారు.... ప్రపంచ భాషలు స్థూలంగా నాలుగు కుటుంబా లకి చెందినప్పటికీ, ప్రతి భాషావర్గా నికీ వారి సంస్కార మంజూష ఉం టుంది. ప్రజల వికాసానికి వారి కవిత్వ ధాతువులు దోషదం చేస్తాయి.... తెలుగులో భావకవిత, అభ్యుదయ కవిత. విప్లవకవిత, దిగంబర కవిత యిత్యాదులు వచ్చినట్లే హిందీలో పనా తన, సూర్యోదయ కవిత, క్షుత్కార కవిత (ఆకలి కవిత్వం), అయోమయ కవిత, అకవితల నుంచి స్మశానిక దాకా కవితావాదాలు వున్నాయి. తమి ళంలో వానంబాడి (స్కయిలార్క్) కవితది ఒక ప్రత్యేక వరవడి. ఆధునిక తమిళ కవితలో రాజకీయ చురకలు హాస్య మిళితమై కనిపిస్తాయి. కవితా వాదమేదైనా ప్రతికవికే 'హ్యూమనిజమ్' ప్రధానం. ద్రవీభూతమైన మనోక్షేత్రా న కవితా బీజం మొలకెత్తుతుంది. మానవతకు పట్టం గట్టే ప్రవాహ కవుల లో ఒకణ్ణి నేను" - అన్నారు నారాయణ రెడ్డి, శ్రీనివాస శాస్త్రి హాలులోని ప్రేక్షకులని సమీక్షకులుగా పేర్కొం టూ - పొట్టి శ్రీరాములు జయంతి సందర్భంగా! 1953 లో 'నవ్వని పువ్వు' కవితా సంపుటిని 'తెలుగు స్వ తంత్ర' లో రెవ్యూ చేసిన రామలక్ష్మి. "కఠినమైన భావాన్ని సున్నితమైన మాటలతో చెప్పగల నారాయణరెడ్డి కవిత నాకెంతోయిష్టం. 'కర్పూర వసం తరాయలు'లోని లకుమని తెలుగు వారెన్నటికీ మర్చిపోలేరు" - అన్నారు. పప్పు వేణుగోపాలరావు కార్యక్రమం నిర్వహించగా, కార్యదర్శి వైయస్‌శాస్త్రి అధ్యక్షులు శాంతప్ప, వెండితెరకు మూడువేల పాటలందించిన 'సినారె' గురించి చెప్పారు.

..... 22

"అనిబిసెంట్ వల్ల ప్రభావితులైన యువకులలో ఒకరు వి.యస్.శర్మ. అనిబిసెంట్ అమెరికా పంపిద్దామను

కుంటే, ఆయన జర్మనీ వెళ్లి, ఫలప్రద మగు వివాహ బంధంతో ఇండియా కొచ్చారు. 1936లో బృందావన్ కాలనీలో వుండగా నాకూ, మిత్రులు నారాయణ స్వామికీ ఆయన బాగా తెలుసు. విద్యా బోధనకు అంకితమైన ఆ భార్యాభర్తలు ఏడుగురు పిల్లలతో స్కూలు ప్రారంభించారు. ఈనాడు స్వర్ణోత్సవం జరుపుకుంటోంది - శతజయంతి, ద్విశతజయంతి కూడా జరుపుకోగలదని నా ఆకాంక్ష.... మాపిల్లలు ఈస్కూలులోనే చదువుకున్నారు. ఒకరోజున మా చిన్నమ్మాయికి కొస్త జ్వరం రావడంతో, స్కూలు మానేయమన్నాము- ఏడుస్తూ కూచుంది స్కూలుకి పంపమని! మా అమ్మాయి విషయమే కాదు- ఆ స్కూలులోనీ పిల్లలందరూ అంతే! స్కూలుకి వెళ్లవద్దంటే ఏడుస్తారు. శర్మా దంపతులలో వారు తమ తలిదండ్రులని మించిన దేవతా స్వరూపులని చూసేవారు - ఆ ధన్యజీవులు నాటిక మొక్క ఒక మహావృక్ష మయింది" — అన్నారు భారత రాష్ట్రపతి వెంకట్రామన్, మ్యూజిక్ అకాడమీలో, చిల్డ్రన్స్ గార్డెన్స్ స్కూలు స్వర్ణోత్సవ సందర్భంగా.... "రాష్ట్రపతిని, ఎన్నో కార్యభారాలలో తల మునకలయే రాష్ట్రపతిని, తమ స్కూలు ఫంక్షన్‌కి రప్పించుకోగలిగిన ఈపిల్లలు ఘటికులు.... వారి లేత హృదయాలలోని పరిశుద్ధగానం ఎవరిని స్పందింప చేయదు? ఏటువంటి ప్రయోజనమూ ఆశించకుండా పసిపిల్లలను గుణవంతులుగా సుజనులుగా తీర్చి దిద్దాలనే మహదాశయంతో, ఏభైఏళ్ల క్రితం విద్యారంగంలో ఒక వినూత్న పంథా తొక్కిన శర్మా దంపతులు లోకోత్తర వ్యక్తులు"- అన్నారు తమిళనాడు గవర్నర్ అలెగ్జాండర్. స్వాగతం తెలిపిన చిత్రా నారాయణస్వామి, తలిదండ్రుల ఆశయానికి కట్టుబడి, తన జీవితాన్ని ఈ విద్యాలయానికి శకుంతలా శర్మ అంకితం చేసిందన్నప్పుడు, హాలంతా కరతాళ ధ్వనులతో హర్షం వెలిబుచ్చింది.... శకుంతల ఎంతో నమ్రతతో వందన సమర్పణ గావించారు .... 'ఏ' అంటే అల్లా, 'బి' అంటే బుద్ధా 'సి' అంటే క్రైస్ట్, 'డి' అంటే దుర్గా. - ఈ వరవడిలో పిల్లలకి చదువు నేర్పవలసిన ఆవశ్యకతని రాష్ట్రపతి ఎంతో సందర్భోచితం సూచించారు.

. . . . 23

'గాంధీనగర్ - రెండవ వీధి' తీసి, సంసార పక్షంగా ఆర్థిక విజయం పొందిన 'సుశీలా ఆర్ట్స్' వారు, మలి ప్రయత్నంగా 'ఆగస్టు 15 రాత్రి' అనే చిత్రం తలపెట్టారు. దర్శకులు: యన్ రామచంద్రరావు. శరత్‌బాబు, అర్జున్, గిరిబాబు, గౌతమి, అంబిక, బేబి షాలిని మున్నగువారున్నారు. సంగీతం: సత్యం. వెనకటిది వెజిటేరియన్ చిత్రమని మిత్రులు అన్నారనీ, యిది నాన్ - వెజ్ అనీ, మసాలా గుబాళింపు వుంటుందనీ, పామ్ గ్రోవ్ పత్రికా సమావేశంలో తెలిపారు రామచంద్రరావు. 'ఆగస్టు 15 రాత్రి' రాజకీయ చిత్రం కాదనీ, సామాజిక పరమైన యితి వృత్తమనీ అన్నారు 'ఫ్రీడమ్

యట్ మిడ్‌నైట్' అనే సుప్రసిద్ధ గ్రంధం పేరుని, మీ టైటిల్ గుర్తు చేయడంలేదా అని నేనడిగిన ప్రశ్నకు, తాము తీస్తున్నది 1947 నాటి కథ కాదనీఒకానొక అగస్టు నెల పదిహేనవ తేదీకి సంబంధించినదనీ వివరించారు హీరోశరత్‌బాబు, దర్శకులు రామ చంద్రరావు.... జులైనాటికి ఈపిక్చరు మూడు షెడ్యూల్స్‌తో పూర్తి కావచ్చు. చిన్న బడ్జెట్ చిత్రాలకు రాష్ట్ర ప్రభుత్వ మిచ్చే సబ్సిడీ సదుపాయం పొంద దలుచుకున్నామన్నారు.................

........ "రయిల్వే ఉద్యోగులలోను, వారి కుటుంబ సభ్యులలోను సంగీత సాహిత్యాదుల పట్ల ఆసక్తి గలవారు అనేకమంది ఉంటారు. ముఖ్యంగా బాలబాలికలలోని నిద్రాణ ప్రతిభను మేల్కొల్పేందుకు ఈ ఆంధ్ర కళా మండలి ఒక వేదిక కాగలగాలి" - అన్నారు, సదరన్ రయిల్వే హెడ్ క్వార్టర్స్ ఆఫీసులోని ఓపెన్ ఎయిర్ థియేటర్‌లో, విభవ ఉగాది ఉత్స వాలకు అధ్యక్షత వహించిన ఛీఫ్ ఆపరేటింగ్ సూపరెంటెండెంట్ యన్వి సుబ్రహ్మణ్యం. ఆయన, గొప్ప గాన కళావతంసులు - 'సరస్వతి' అనే సం గీత సభకు సారధి. ఆ తర్వాత జస్టిస్ వెంకటస్వామి, తమ యింట్లో తెలుగు మాట్లాడుతారనీ, కాని చదవడం వ్రాయడం మాత్రం రాదనీ అన్నారు. ఉగాది పండుగలోని విశిష్టతని వివ రించారు మిక్కిలినేని .... "పదిహే నేళ్ల క్రితం ఈ కళామండలి వారు నన్ను సత్కరించారు. రయిల్వే ఉద్యో గుల జీవితాలలో ఎటువంటి రొటీన్ వున్నదని సుబ్రహ్మణ్యం గారు చెప్పా రో,' అటువంటి రొటీనే మా జీవితా లలో లేకపోలేదు. ఎటొచ్చీ, గ్లామర్ వరల్డ్ కాబట్టి, సెట్ మీద ఆ ఒత్తిడే, ఆ శ్రమా బయటివారికి తెలీదు. మీ వంటి వారిని కలుసుకున్నప్పుడు ఎంతో సంతోషంగా ఉంటుంది.... నేషనల్ ఫిలిమ్ యవార్డ్స్‌కి ఈ సంవ త్సరం జ్యూరీ మెంబరుగా వేశారు నన్ను - ఇరవై రోజుల పాటు వుండాలి ఢిల్లీలో. ఈ సాయంత్రం ఫ్లయిట్‌కి వెళ్లాల్సి వుంది. కాని, చక్రధరరావు గారికి మాటిచ్చి వుండటం వల్ల, రేపు మార్నింగ్ ఫ్లయిట్‌కి మార్చుకొన్నాను. మీరు నన్ను ఎంతో అభిమానంతో ఈ ఉత్సవానికి ఆహ్వానించినందుకు నా మనఃపూర్వక కృతజ్ఞతాభి వంద నలు" - అన్నారు చక్కటి తెలుగులో షావుకార్ జానకి.... కార్యదర్శి సదా నందరావు వందన సమర్పణ. తర్వాత ఆనంద్ లలిత సంగీతం, వెంపటి చిన సత్యం బృందం వారి కూచిపూడి నాట్య ప్రదర్శన.

—యన్నార్ చందూర్

---

బోస్టన్‌లో అతనికెంత తెలుసు ? - అని అడుగుతారు. న్యూయార్క్‌లో అతనికెంత ఆస్థి వుంది? - అని అడు గుతారు. ఫిలడెల్ఫియాలో అతని తలి దండ్రు లెవరు ? - అని అడుగుతారు.

—మార్క్‌ట్వేన్

# జననం

# లేక 

# మరణం

## ఇది మీ కుటుంబంలో సంభవించినప్పుడు
## మీ స్థానిక రిజిస్ట్రారుతో
## తప్పక రిజిస్టరు చేయండి

ఇది మీకు చాలా సహాయకారి కాగలదు

**జనన ప్రమాణపత్రం**
వయస్సుకు నిదర్శనం

- స్కూలులో ప్రవేశానికి
- ఉద్యోగం సంపాదించుకోవటానికి
- ఓటు హక్కును వినియోగించుకోవటానికి
- డ్రైవింగు లైసెన్సును పొందటానికి
- జీవిత బీమా పాలిసీని తీసుకోవటానికి

**మరణ ప్రమాణ పత్రం**
దీని అవసరం

- ఆస్తి వారసత్వంగా పొందటానికి
- జీవిత బీమా ధనాన్ని పొందటానికి
- ఆస్తి సంబంధిత సమస్యల పరిష్కారానికి

## సకాలంలో రిజిస్టరు చేసి
## ప్రమాణ పత్రాన్ని ఉచితంగా పొందండి

చట్ట ప్రకారం జనన మరణాలను రిజిస్టరు చేయటం తప్పనిసరి
ఆలస్యంగా రిజిస్టరు చేయటానికి కూడా అనుమతి ఇవ్వబడింది

## రిజిస్ట్రారు జనరల్, ఇండియా

## సమీక్షలు     చిత్రజగతి

### లలిత శ్రీ వారి 'అభినందన'

రాజా (అశోక్‌కుమార్) ఒక చిత్ర కారుడు, రాణి (శోభన) నాట్యకారిణి; కళలు నేర్పే కాలేజీ రోజులలోనే యిరువురూ స్వీట్ నతింగ్స్ చెప్పు కుంటూ, బోటుషికార్లు చేస్తూ తలమున కలుగా ప్రేమలో పడతారు. అతను, ఆమె బొమ్మలు రకరకాల డ్రెస్సులతో వేస్తాడు - ఆమె సంతసిస్తుంది - హృద యార్పణ గావిస్తుంది. అదంతా ప్రేమ క్షీరసాగర మధనం - స్వప్నాంచల విహారం.... రాణి అక్కగారు కమల (కార్తిక్), తన భర్త శ్రీకాంత్‌తో (శరత్ బాబు) మూడో పురుడు పోసుకోవడా నికి పుట్టింటికి వస్తుంది. తల్లి లేదు, తండ్రి (జెవి సోమయాజులు)వున్నాడు. డైనింగ్ టేబుల్ దగ్గర శ్రీకాంత్, 'ఏ మొగుడు లేకపోతే అక్క మొగుడే దిక్కు' అనే పాత చింతకాయ పచ్చడి జోక్ విసురుతాడు. పిల్లలిద్దరూ పిన్నికి మాలిమి అవడం, కమల ప్రమాద వశాత్తూ జరిగిన అబార్షన్‌లో మరణించ డమూవల్ల ఆయన జోక్ కాస్తా భవిష్య ద్వాక్యమవుతుంది. ఈ పెళ్ళి శ్రీకాంత్‌కి యిష్టం వుండదు - పిల్లలకోసం తప్పని సరి అనుకుంటాడు. రాణీ రాజాల ప్రేమ తెలుసుకున్న శ్రీకాంత్, తను మరణించి వారి ప్రేమకు పూలమాల వేయడం. చాల కృతకంగాను, అసహజంగాను, స్వభావ విరుద్ధంగాను ఉంది. అయిన ప్పటికి, నంది అవార్డు పొందగలిగింది ఈ చిత్రం. ఫొటోగ్రఫీ బావుంది. శోభన చక్కగా చేసింది. దర్శకత్వం: అశోక్‌కుమార్. నిర్మాత: రమణమూర్తి. సమర్పణ: జి. బాబు.

### రాఘవేంద్రా వారి 'దొరగారింటో దొంగోడు'

దొరగారు అమెరికాలో యమ్ బి ఎ చదువుకుంటున్నారు - ఆయన తన ఎస్టేటుకి రావలసివుంది. తల్లిగారు (అన్నపూర్ణ) దైవభక్తి పరాయణు రాలు; చెల్లెలు గంగ 'హరే రామ, హరే కృష్ణ' ఉద్యమాన్ని తిన్నగా తమ యింట్లోకి పట్టుకొచ్చి, గంగ పేరుని 'గంజాయ్' గా మార్చుకొని, తన పేర అకవుంట్ తెరిచి, చెక్ బుక్ యివ్వమని శాసించగా, సదరు ఎస్టేటు మేనేజరు (సత్యనారాయణ) తల్లి సమక్షంలో ఆ చెక్ బుక్ ఈమెకి సమర్పిస్తాడు. డబ్బు పోతే పోయింది, కూతురు బాగుపడాలని తల్లి తపన. అమ్మాయి తొందరగా బాగుపడేందుకే, చెక్ బుక్ ఆమె చేతికిచ్చానని అంటాడు

విలనైన ఎస్టేటు మేనేజరు : ఈ విలన్ కుట్రతో, యస్ నో ఆల్ రైట్‌ల వరకే పాండిత్యం గల నకిలీ రాంబాబు (శోభన్‌బాబు) దొరగారి వేషంలో రంగప్రవేశం గావిస్తాడు. హీరోయిన్ (రాధ) తండ్రి పోలీసు వుద్యోగి; హీరో యినేమో బ్యాంకు మేనేజరు. ఆ ఎస్టేటు గౌరవం కాపాడుటమే ఈ తండ్రీ కూతుళ్ల ధ్యేయం. బాంకమ్మ (రాధ) పేద రైతులకి రుణాలిచ్చే నిమిత్తం తమ ఊరు వచ్చినప్పుడు, నకిలీ రాంబాబు అయిన సత్యం, తను ఎందు వల్ల వేషం కట్టవలసి వచ్చినదీ, నిర్భయంగా నిజాయితీతో కథానాయి కకు చెప్పగా, ప్రేమోదయమవుతుంది- ఆ తర్వాత యింకా బాలా కథ నడు స్తుంది. శోభన్‌బాబు అభిమానుల చిత్రమిది.దర్శకత్వం: కోడి రామకృష్ణ. నిర్మాత : కె. సత్యనారాయణ.

## వియస్ ఆర్ట్ వారి 'ఇంద్ర ధనుస్సు'

ఆమె (జీవిత) నాట్య ప్రదర్శన చూసి, అన్ని విధాలా పనికొచ్చే మోడల్ అనుకుంటాడతను (రాజశేఖర్) –గ్రీన్ రూమ్‌లోకి వెళ్లి పద్మని అభినందిస్తాడు. ఆమె టైపిస్ట్‌గా పని చేస్తున్నదని తెలి శాక, వారి ఆఫీసుకి వెళ్లి, మోడలింగ్‌లో బాలా డబ్బు వున్నదనీ, ఎప్పుడైనా తన సహాయం కావాలనిపిస్తే, ఫోను చేయమనీ తన కార్డు యిచ్చి వస్తాడు రవి. అమె ఉద్యోగం పోతుంది. చెల్లెలు చదువుకోసం మోడలింగ్ తప్పని సరిగా చేబట్టవలసి వస్తుంది. గర్భవతి అయిన పద్మను నిర్దాక్షిణ్యంగా వెళ్ల గొట్టాడనీ, విడాకులకు ఆమె అంగీ కరించని కారణాన కక్షతో దారుణంగా హత్య చేశాడనీ, లేడీ జర్నలిస్ట్ కమల, త్వరలో ఉరితీయనున్న రవిని జైలులో యింటర్‌వ్యూ చేసి, ప్రథమార్థంలోని కథనం చెబుతుంది. జైలు నుంచి తప్పించుకొచ్చి, కమలా పద్మల స్నేహితు రాలయిన డాక్టర్ శాంత వైద్య సహాయం పొంది, ద్వితీయార్థంలో రవి తన గాథ చెబుతాడు. సంపన్నుడైన రవి, పద్మని ప్రేమించి పెళ్లి చేసుకుంటాడు. అయితే రవి అసిస్టెంట్, కిటికీ కంత గుండా ఆమె నగ్న చిత్రాలు తీసి, తన కోరిక తీర్చమని, బ్లాక్‌మెయిల్ చేస్తాడు. పెనుగులాటలో ఆమె పొడుచుకు చని పోతుంది - కాని, నేరం రవి మీద పడుతుంది. ఆ అసిస్టెంట్‌ని చంపి పోలీసులకు వశమవుతాడు రవి.... దర్శకులు రంగారావు కథని చక్కటి సస్పెన్స్‌తో నడిపించారు. నిర్మాత : శ్రీనివాసరావు.

## ఆనంద్‌వారి 'పూగా కాచవదమ్' (మళయాళం)

ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరక్టరేట్‌లో మాలతి(సుహాసిని)ఆలిండియా కాడర్‌కి చెందిన ఒక ఉద్యోగిని. అలాగే యలెక్స్ (బాలకృష్ణ మీనన్) కూడా అదే కాడర్‌లోని మరొక ఉద్యోగి. మాలతి తన ఊహా పోహల్లో ఎటు వంటి వేర్పరో, నేరస్థులపై విజృం

ఖించడంలో అలెక్ అంతటి సాహసి. వీరిద్దరికీ పరస్పరాభిమానం ఉన్నప్పటికీ అది ఉద్యోగరీత్యా ఏర్పడ్డ సహజానుబంధం. ఉన్నతాధికారి ప్రవర్తన పై యిద్దరికీ అనుమానంగా ఉంటుంది. మాలతి 'డికోడ్' చేసిన సమాచారం యావత్తు నేరస్థుల ముఠాకి ఎలా తెలిసిపోతోంది ? ఆ ఉన్నతాధికారికి తన స్టెనో పట్ల వీక్‌నెస్. ఆ స్టెనోయే యిక్కడి రహస్యాలు విలన్ రాకీకి (త్యాగరాజన్) చేరవేస్తోంది. హసాన్ అనే ముస్లిమ్ యువకుడు తనే రాకీగా అరెస్టవుతాడు. అసలు రాకీ జైలులో వున్న మనిషి కాదని నిర్ధారణగా చెబుతుంది మాలతి. ఇంత తెలివిగల మనిషి తనకి ఎసరు పెడుతుందేమోనని భయపడతాడు ఉన్నతాధికారి. రెవిన్యూ ఇంటిలిజెన్స్‌శాఖని, సినీ హిరోయిజమ్ ప్రదర్శించే ప్రభుత్వ విభాగంగా చూపిన ఈ చిత్రానికి దర్శకులు మధు. సుహాసిని కోసం చూడాలి ఈ చిత్రం.

## పద్మజా విజయలక్ష్మి

## 'డాక్టరు గారి అబ్బాయి'

చంద్రశేఖరం (గొల్లపూడి మారుతీరావు) అనే సద్వర్తనుడైన డాక్టరు గారికి ఇద్దరబ్బాయిలు - పెద్ద కొడుకు శ్రీకాంత్ (శివకృష్ణ) పోలీసు యిన స్పెక్టరు ; అతని భార్య సరోజ (అరుణ) పబ్లిక్ ప్రాసిక్యూటర్ ; చిన్నబ్బాయి క్రాంతి (అర్జున్) అవినీతి అన్యాయాలపై తిరుగుబాటు జరిపే ప్రజా సంరక్షకుడు. గట్టి చేంతాడుకి చెరో వైపునా బాల్చీకట్టి, ఆ రెండు బాల్చీల వినూత్నాయుధంతో, ప్రజాశ్రేయస్సుకి వ్యతిరేకంగా సమ్మెజరుపుతున్నవారిని విజయవంతంగా ఎదుర్కొన్న వీరుడనిపించుకొని, జైలుకెళ్తాడు ; అరెస్టుచేసినది అన్నగారు; ప్రాసిక్యూషన్ వాదన వదినగారు. జైలునుంచి తిరిగొచ్చిన క్రాంతి, తండ్రి మాట ఖాతరు చేయకుండా భానోజీ (కోటశ్రీనివాసరావు) నకిలీ మందుల కంపెనీలో మెడికల్ రిప్రెజెంటేటివ్‌గా జాయినవుతాడు ; పార్థసారథి (హేమసుందర్) కూతురు స్వాతితో (నీతూ) అప్పటికే పసందైన ఏరువాల డాన్సులు సాగుతున్నాయి. తోడుదొంగలైన భానోజీ రామోజీలకు క్రాంతిబుద్ధిచెప్పడం యిందులోని యితివృత్తం. నకిలీ మందులు లేకపోలేదు; కాని, వాటి తయారీ యింత అసందర్భంగాను, సినిమా సవాళ్లతోను సాగదు. డ్రగ్ కంట్రోల్ యాక్ట్ ఏ విధంగా పని చేసేదీ పరిశీలించివుంటే బావుండేది. ఈ ఫార్ములా చిత్రానికి దర్శకులు : రా మ చ ం ద్ర రా వు. నిర్మాత : రామరాజు.

## శ్రీదేవి మూవీస్

## 'చిన్నోడు - పెద్దోడు'

మామయ్య (ప్రభాకరరెడ్డి) కూతురు సుజాత (కుష్బు), తమ పల్లెటూరి యింటిని పావనం చేయదలుచుకున్నదని అమ్మమ్మ (నిర్మల) ద్వారా విని, వీధి బాగుచేసి, యింటికి రంగులు వేసిన అమాయక హీరోలు పెద్దోడు (చంద్రమోహన్), చిన్నోడు (రాజేంద్ర ప్రసాద్). వారి అమాయకత్వంతో,

వెర్రి బాగులతనంతో, బంధువులంటే వుండే ఆపేక్షలో నీతీ నిజాయితీ, ప్రస్ఫుటమవుతుంటాయి. బనియనుల కంపెనీ ప్రొప్రయిటర్ కొడుక్కీ (సుధాకర్), భాగ్యవంతులమ్మాయి సుజాతకీ పెళ్ళి కావలిసివుంది. అయితే, కారాక్సిడెంట్‌లో ఆ అమ్మాయి తల్లిదండ్రులిద్దరూ, సరిగ్గా ముహూర్తానికి ముందు ఠఫీమని, ఆ కుసుమకోమలిని, నిర్ధనురాలిగాను, నిస్సహాయురాలిగాను, నిరాశ్రయురాలిగాను చేస్తారు. సహజంగా మంచివాళ్లు, మమతాను రాగాలు గలవాళ్లూ అయిన ఈ బావలిద్దరూ, ఆ అమ్మాయిని తమ వెంటబెట్టుకొని పల్లెటూరికి పట్టుకొస్తారు; డబ్బు నిషా దిగిపోగానే ఆ అమ్మాయికి మంచి చెడ్డలు తెలుస్తాయి. తమలో ఎవరిని ఈ సుందరాంగి వరిస్తుందా అని పెద్దోడు చిన్నోడు తికమక పడుతుండగా, ఆమె చిన్నోడివైపు మొగ్గుతుంది; పువ్వులకి నోచుకోని ఒక పద్మశాలీ యువతికి పెద్దోడు నూతన జీవితం ప్రసాదిస్తాడు. రేలంగి నరసింహారావు దర్శకత్వమంటే హాస్య కుసుమపరాగం. నిర్మాత: అనితాకృష్ణ.

## విజయకృష్ణావారి 'కలెక్టర్ విజయ'

అయిదారు సంవత్సరాల తర్వాత ('అంతం కాదది - ఆరంభం' పిక్చర్ తర్వాత), విజయనిర్మలని వెండితెర మీద చూస్తారు ప్రేక్షకులు. ఎంతో గంభీరమూ ఉదాత్తమూ అయిన పాత్ర ఆమెది ఈ పిక్చర్లో! ఒక నాటికారు ప్రమాదంలో తలిదండ్రులు మరణించారు. భర్త ఏమయాడో జాడ తెలియదు; అలాగే పసివాడు ఏమయాడో కూడా తెలియదు. ఇంతటి శోకభారంలో మునిగి, గుండెల్లో ఆరని అగ్ని పర్వతం రగులుతున్నా కలెక్టరుగా తన కర్తవ్య నిర్వహణ, గీతాకారుడు చెప్పిన విధంగా నిర్వహించే విజయకు, ఆ జిల్లా కేంద్రానికొచ్చి ఛార్జీ తీసుకోబోయే ముందు, ఇద్దరమ్మాయిలకు మత్తు మందు యిచ్చి ఎత్తుకుపోతున్న ఒక వాన్ తటస్థ పడుతుంది. ఆ పిల్లలని కాపాడటంతో బాటు, ఆమెకు ఈ జిల్లాలోని కిడ్నాపింగ్ కథల గురించి ఎన్నో సందేహాలు వస్తాయి. యస్పిరామనాథం (గుమ్మడి) కుమారుని (నరేష్) సహాయంతో, డిపార్ట్‌మెంటల్‌గా గాక, ప్రయివేటుగా పరిశోధన గావించి, ప్రమాదకరమైన కోటీశ్వర్రావు అసలు కథని బయటికి తీస్తుంది. ఈలోగా కొన్ని ఫార్ములా మలుపులు వున్నప్పటికీ, ఆ కోటీశ్వర్రావు కూతురే (రమ్యకృష్ణ). ఈమె కోడలు కాసున్నప్పటికీ, టెలిఫోన్ ద్వారా రహస్యాలు తెలుపుతున్నది భర్త అయినప్పటికీ స్క్రీన్ ప్లే రస భూయిష్టంగా ఉంది. ఫైటింగ్స్ తగ్గించి వుంటే యింకా రక్తికట్టేది. దర్శకత్వం: విజయనిర్మల. నిర్మాత: రమానంద్.

కట్టి పడవేసే బంధాలన్నీ తెంచుకున్న మీదట కనిపిస్తుంది స్వాతంత్ర్య తేజం. —రివర్ హెూవి

# ముఖచిత్రం

ఉన్నత పదవీ బాధ్యత నిర్వహించేందుకు అనుభవమూ ఆరోగ్యమూ ప్రధానంగాని వయసు కాదనే విషయం, కాసు బ్రహ్మానంద రెడ్డి నియామకం రుజువు చేస్తున్నది. మహారాష్ట్ర గవర్నరైన బ్రహ్మానందరెడ్డి (78 ఏళ్లు) అపార రాజకీయానుభవం గల వ్యక్తి. ఆంధ్రరాష్ట్ర చరిత్రలో ఏడున్నర సంవత్సరాలు ముఖ్యమంత్రిగా వ్యవహరించిన ఘనత ఆయనొక్కరిదే! ప్రభుత్వోద్యోగుల సమ్మెను, ఇరువైపుల (ఆంధ్రా - తెలంగాణా) వేర్పాటు వాదాన్ని, విజయవంతంగా పరిష్కరించి, రాష్ట్రానికొక సుస్థిరతను చేకూర్చిన సమయంలో, కాంగ్రెస్ ప్రెసిడెంట్ ఇందిరాగాంధీ ఆదేశంపై, ముఖ్యమంత్రి పదవికి రాజీనామా యివ్వవలసి వచ్చింది (1971). ఆ తర్వాత కేంద్ర మంత్రి వర్గంలో చేరారు.... ఎమర్జన్సీ ప్రవేశపెట్టడానికి ఆయన వ్యతిరేకి. కాని, సిద్ధార్థ శంకరే సలహా ప్రకారం, ఇందిరాగాంధీ ఎమర్జన్సీ ప్రకటించి. అరవై వేల మందిని నిర్బంధించారు. అయితే, డిటెన్షన్ ఆర్డర్‌పై ఈయన ఆమోద ముద్రలేదనీ, విడుదల చేస్తున్న ఆర్డరు మీద మాత్రమే ఈయన సంతకం వున్నదనీ 'షా' కమీషన్‌లో సైతం వెల్లడయింది. చరణ్‌సింగ్ ప్రభుత్వంలో ఈయన ఉన్నారు. 1978 లో కాంగ్రెస్ ప్రెసిడెంట్ అయారు. ఆరవ ఫైనాన్స్ కమీషన్‌కి ఛెయిర్మాన్. 1980లో నరసరావుపేట నుంచి లోక్‌సభకు ఎన్నికయారుగాని 1984 ఎన్నికలలో వోడిపోయారు. గత ఏడేళ్లగా ఆయన యాక్టివ్ రాజకీయాలకు దూరంగా ఉన్నట్టే.... 1909 జులై 28వ తేదీన నరసరావుపేటకు చేరువనున్న చిరుమామిళ్ల గ్రామంలో జన్మించిన కాసు బ్రహ్మానందరెడ్డి, తన పదకొండవఏట, సోదరులిద్దరితోను గాంధీగారిని విజయవాడలో చూశారు. మహాత్మునివల్ల ప్రభావితులై ఖద్దరు ధారణ ప్రారంభించారు. మద్రాసు పచ్చయ్యప్పాస్‌లో గ్రాడ్యుయేషన్, 'లా' కాలేజీలో డిగ్రీ అయాక, నరసరావుపేటలో ప్రాక్టీసు; సత్యాగ్రహోద్యమం. 27వ ఏట ఒంగోలు జిల్లా బోర్డు ప్రెసిడెంట్; 1946 లో మద్రాసు అసెంబ్లీ సభ్యత్వం.... సంజీవరెడ్డి మంత్రి వర్గంలోను, సంజీవయ్య మంత్రివర్గంలోను రెండింటిలో మంత్రిగా వుండి, తను ముఖ్యమంత్రి అయాక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌లోని అంతఃకలహాలకు ఒకవిధంగా స్వస్తి చెప్పారు.... 'ఎన్నికల సంరంభంలో మనం చేసిన మంచీ చెడూ మర్చిపోతారు ప్రజలు. గాలివాటాన్ని బట్టిజయాపజయాలునిర్ణయమవుతాయి' అంటారు అనుభవజ్ఞులైన బ్రహ్మానందరెడ్డి.

మహాయోగి

# నారాయణగురు

అర్వాచీనమైన భారత చరిత్రలో మనకు ఎందరో ఋషులు, యోగులు కన్పిస్తారు. ఉపనిషద్బోధన లను ప్రామాణికంగా భావించినవారు కొందరైతే, భౌతిక వాదానికి ప్రాధాన్యం ఇచ్చినవారు కొందరు. ఆనందానుభూతి జీవిత ధ్యేయమని బోధించిన తాంత్రికులు, గీతావాదులు, అద్వైతాన్ని ప్రబోధించిన ఆదిశంకరుల వంటి వారు, అంతా ఈ కోవకు చెందినవారే. కొందరికి జగత్తు వాస్తవ మైతే మరికొందరికి అది కేవలం మిథ్య. పంచేంద్రియాల ద్వారా అనుభూతిని కల్గించేది మాత్రమే వాస్తవమన్నది లోకాయతికుల వాదం. ఆత్మ వాస్తవ మైనదా అన్న ప్రశ్నకు వారు విచిత్ర మైన సమాధానం ఇస్తారు.

మద్యంలో మత్తు కలిగించే పదార్థపు లక్షణం ఎటువంటిదో, ఆత్మ కూడా అటువంటిదేనని వారి సిద్ధాంతం. మద్యంలో మిశ్రితమైన విభిన్న పదార్థాలు విడివిడిగా మత్తు కల్గించేవి కాకపోవచ్చు. అయితే ఈ విభిన్న పదార్థాల మిశ్రణం వల్లనే ఆ మిశ్రణా నికి మత్తు కల్గించే లక్షణం సిద్ధిస్తున్నది. ఇదేవిధంగా కొన్ని పదార్థాల మిశ్రమం వల్ల స్పృహలనే లక్షణం సిద్ధిస్తున్నది. ఇదే ఆత్మలనబడే పదార్థం. ఇటువంటి యోచనా రీతి పాశ్చాత్యులలో కూడా ఉంది. దీనిని సృజనాత్మక పరిణామం అంటారు. ప్రాణవాయువు లేదా ఉదజనికి, విడివిడిగా చూస్తే నీటికి ఉండే లక్షణాలు కన్పించవు. నీటి యొక్క విస్పష్టలక్షణాలైన తడి గాని, ద్రావ్యతగాని ఈ రెండు మూలకాలలో నూ కన్పించవు. అయితే అవి ఒక పద్ధతిలో మిశ్రితమైనప్పుడే నీరు అన బడే కొత్త పదార్థం ఏర్పడుతున్నది. ఇదే సూత్రంగా సృజనాత్మక పరిణామ వాదమని చెప్పవచ్చు.

ఇక తాంత్రికుల తాత్విక లక్ష్యం విభిన్నంగా కన్పిస్తుంది. బ్రహ్మ పదార్థంతో ఆత్మ విలీనం కావడంపట్ల వారికి అంత ఆకర్షణ లేదు. పంచ దారను తింటానే కాని పంచదారగా మారడం నా లక్ష్యం కాదు అన్నది తాంత్రికవాదుల లక్ష్యంగా కన్పిస్తుంది. ఈ ఇరు వర్గాల వారు ప్రపంచాన్ని యదార్థమని భావిస్తున్నవారే కనుక దానిని మార్చాలని ప్రయత్నించడంలో హేతు విరుద్ధత ఏమీ లేదు. అయితే ప్రపంచం పూర్తిగా మిథ్య అని ప్రబో ధించే వారితోనే వైరుధ్యత వస్తున్నది. ప్రపంచం మిథ్య అయితే అది కేవలం క్షణికమే అయితే, ఈ ప్రపంచం నుంచి విముక్తి చెందడమే, లక్ష్యం అయితే, ఆ ప్రపంచాన్ని సంస్కరిం

చడం పట్ల ఆసక్తి ఎందుకు ? అన్న ప్రశ్న వస్తుంది.

ప్రపంచ సంస్కారానికై కర్మాచరణను గీత కూడా ప్రబోధించింది. అయితే ఈ కర్మాచరణకు ఒక షరతు విధించింది. ఏ కర్మను ఆచరించినా, కర్తగానో, లేదా కర్మగానో, దానిలో విలీనం కాక, నిష్కామ దృష్టితో, నిమిత్త మాత్ర దృష్టితో కర్మాచరణకు పూనుకోవాలన్నది భగవద్గీత నిర్దేశం.

ప్రపంచం కేవలం మిధ్య అని ఆదిశంకరులు కూడా త్రోసి పుచ్చలేదు. ప్రపంచం వాస్తవమైనది కాక పోయినా వ్యావహారిక స్థితి గలదని ఆయన అంగీకరించారు.

ఇక పూర్వులను విడిచి ప్రస్తుత కాలానికి వస్తే ఈ ప్రపంచం పట్ల విశేషాసక్తిని ప్రదర్శించి బాధిత మానవాళి సముద్ధరణకై కర్మాచరణకు దిగాలని ప్రబోధించిన వారెందరో కన్పిస్తారు. యువకులు ఆరోగ్యంగా, బలంగా ఉండాలని స్వామి వివేకానంద ఉద్ఘాటించారు. వేదాంతం వల్లకంటె ఫుట్‌బాల్ ద్వారా మోక్ష సాధన సుగమమని కూడా ఆయన అన్నారు. "మళ్ళీ మళ్ళీ జన్మించాలనేది నా ఆకాంక్ష. ఈ జన్మల ద్వారా బాధితులకు సేవచేసే అవకాశం లభిస్తుంది" అని అన్నారు. భూమి పైనే చేయవలసినది ఎంతో ఉన్నదన్న ప్రగాఢ విశ్వాసం కారణంగానే జననమరణ చక్రం నుంచి బైటపడి మోక్షాన్ని పొందాలని ఆయన కాంక్షించలేదు. బుద్ధుడు కూడా ప్రాపంచిక జీవనంలో పాటించవలసిన విధులపట్ల విశేషాసక్తిని కనపరచారు తప్ప పారలౌకిక విషయాలను గురించి అంతగా పట్టించుకొనలేదు.

పైన పేర్కొన్న వైరుధ్యత క్రైస్తవ మతంలో కూడా కన్పిస్తుంది. జీవనం క్షణభంగురమే అయితే ఈ కాస్త దానికి ప్రపంచాన్ని సంస్కరించాలన్న తపన ఎందుకు ? ముముక్షువులుగా కాలం గడుపుతూ ఆత్మ పరిణతి సాధనకు ప్రయత్నించడం మంచిదన్న వాదన క్రైస్తవ మతంలో కూడా కన్పించేది. అయితే క్రైస్తవ తాత్విక దృక్పథంలో ఇటీవల వచ్చిన మార్పులు ఈ వైరుధ్యాన్ని తొలగించాయి. క్రైస్తవ తాత్విక దృక్పథంలో ఈ మార్పునకు దక్షిణ అమెరికాలో అంకురార్పణ జరిగింది. ఈ నవ తాత్వికులు పాతసిద్ధాంతానికి కొత్త అర్థం చెప్పారు. ఈ ప్రపంచం నుంచి విముక్తి అంటే ప్రస్తుతం అసమానతలతో, బాధలతో నిండియున్న ప్రపంచానికి విముక్తి అని వారు అర్థం చెప్పారు. అంటే ప్రపంచంలోని అసమానతలను, బాధలను తొలగించడానికి నడుం బిగించాలని కూడా కర్తవ్య బోధ చేసారు. మోక్షం అంటే ప్రపంచం నుంచి పారిపోవడం కాదు. అన్యాయాలు వంటి లోపాల నుంచి ఈ ప్రపంచాన్ని విముక్తం చెయ్యడమే మోక్షమార్గమని వారు ప్రవచించారు. అన్యాయం కొనసాగినంత కాలం

హింసకు ఆస్కారం ఉంటుందని, దారిద్ర్యం ఉన్నంతకాలం అన్యాయం కొనసాగుతుందని క్రైస్తవ తాత్వికులు కుండ బ్రద్దలు కొట్టినట్టు చెప్పారు. దీని ఫలితంగానే కేమిలో టారెస్ వంటి విప్లవ క్రైస్తవుల ఆవిర్భావం జరిగింది.

అసలు ఈ విషయ గ్రహణానికై దక్షిణ అమెరికా వరకు వెళ్లడం ఎందుకు ? మన దేశంలోనే, కేరళ రాష్ట్రంలో నూరు సంవత్సరాలక్రితం "నారాయణ" అన్న హిందూ యోగి జీవించారు. ఆయన భక్తులంతా ఆయనను 'గురు' అన్న గౌరవ వాచకాన్ని జోడించిన కారణంగా ఆయన 'నారాయణ గురు' గా ప్రసిద్ధులయ్యారు. హైందవ తాత్విక సిద్ధాంతాలకే విప్లవాత్మకమైన అర్థం చెప్పి, ఎంతో అభినివేశంతో, దీక్షతో సంఘం సంస్కరణకు పూనుకున్నారు. ఆదిశంకరుల అద్వైత సిద్ధాంతాన్ని నారాయణగురు పూర్తిగా అంగీకరించారు. అంతమాత్రంలో ఆగక ఆ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడానికి నడుం కట్టారు. సృష్టి అంతటికీ ఒకే పరమాత్మ సర్వ వ్యాప్తిగా ఉంటే కులపరమైన తేడాలకు ఆస్కారం లేదని ఆయన తార్కికార్థం చెప్పారు. ఆదిశంకరుల రచనలుగా పేర్కొన బడుతున్న కొన్ని శ్లోకాలను బట్టి ఆయన కులవ్యవస్థను సమర్థించారని, శూద్రులకు వేదాధ్యయనాన్ని నిషేధించారని చెప్పడం జరుగుతున్నది. ఇది ఎంత నిజమో చెప్పలేము. కాని, కుల వ్యవస్థకు వ్యతిరేకంగా ఆయన ఉద్యమం నిర్వహించిన దాఖలాలు ఏవీలేవు. నారాయణ గురు మాత్రం కుల వ్యవస్థకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని నిర్వహించారు.

నారాయణ గురు సిద్ధాంతాలు విశ్వ జనీనమైనవి. సర్వ మానవులు ఒకే కులానికి చెందినవారని ఆయన నొక్కి వక్కాణించారు. మానవునికి, భగవంతునికి మధ్య సంబంధాన్ని నిర్వచించేదే మతం. అందువల్ల దేవుడు ఒక్కడే అయినప్పుడు మతం కూడా ఒక్కటే ఉండాలన్నది ఆయన భావ్యం. "మానవాళి అంతకూ కులం, మతం, దేవుడు కూడా ఒకటే" అని ఆయన ఖండితంగా చెప్పారు. మతం పట్ల విపరీతమైన అభినివేశం వ్యక్తం చేసి వారిని ఉద్దేశించి ఆయన ఈ విధంగా అన్నారు.

"మీరు ఏ మతానికి చెందిన వారైనా పరవాలేదు. ఉత్తమ మానవులుగా ఆ మతం మిమ్మ తీర్చగలిగితే అదే చాలు." ఇంతటి నిర్భీతిగా, విశ్వ జనీనంగా మతం అంతర్యాన్ని మరెవ్వరూ వివరించలేదు. కులం అంటే వృత్తి ధర్మాల ఆధారంగా జరిగిన విభజన అని గాంధీజీ కూడా సమర్థించారు. మత విభేదాలను తుడిచి వెయ్యాలని గాంధీజీ ఖండితంగా భావించలేదు. "క్రైస్తవుడు ఉత్తమ క్రైస్తవుడుగా ఉండాలి. ముస్లిం ఉత్తమ ముస్లిమ్‌గా ఉండాలి. హిందువుడు ఉత్తమ హిందువుడుగాఉండాలి" అని మాత్రమే ఆశించారు. శ్రీ నారాయణ

గురు అంతకంటే ముందుకు వెళ్లారు. కులమతాంతర వివాహాలను, భోజనాలను ఆయన ప్రోత్సహించారు. కేరళలో తొలిసారిగా మతాంతర వివాహాన్ని ఆయన స్వయంగా జరిపించారు. ఒక ఎజవా యువకునికి, ఒక జర్మన్ క్రైస్తవ యువతికి ఆయన స్వయంగా వివాహం జరిపించారు.

నారాయణ గురు కేరళలో అట్టడుగు కులంగా పరిగణించబడే ఎజవా కులంలో జన్మించారు. వారిని అవర్ణులుగా పరిగణించి, దేవాలయాలలోకి రాకుండా నిషేధించారు. అయితే నారాయణ గురు ఆ దేవాలయాలలో ప్రవేశం హక్కుకై పోరాడలేదు. తన కులంవారు స్వయంగా దేవాలయాలు నిర్మించుకోవాలని ఆయన ఉద్బోధించారు. బ్రాహ్మణాధిపత్యాన్ని సవాలు చేస్తూ, ఎజవా కులంవారు నిర్మించుకున్న దేవాలయానికి ఆయన స్వయంగా ప్రారంభోత్సవం చేసి, ఆ దేవాలయంలో అందరికీ ప్రవేశం కల్పించారు. 1932 లో తిరువాన్కూరు మహారాజా తన సంస్థానంలోని దేవాలయాలన్నింటిలో అన్ని వర్ణాల హిందువులకు ప్రవేశం కల్పిస్తూ ఆర్డినెన్సు జారీ చేశారు. ఇది రాజకీయోద్దేశంతో గైకొన్న చర్య. అన్ని దేవాలయాలలోను అన్ని కులాల వారికీ, మతాలవారికి ప్రవేశం కల్పించాలన్న నారాయణ గురు ఆదర్శాన్ని పూర్తిగా సంతృప్తి పరచలేదు.

దేవాలయాలను స్వయంగా ప్రారంభించడంతోటే ఆయన ఆగిపోలేదు. ఒక దేవాలయాన్ని ఆయన శారదా దేవికి అంకితం చేసారు. ఆయన చివరగా ప్రారంభించిన దేవాలయంలో ఒక అద్దాన్ని ప్రతిష్టించారు. ఆ దేవాలయాన్ని దర్శించే ప్రతి వ్యక్తి అద్దంలో తనను చూసుకొని, తనలో భగవంతుని చూసుకోవాలని ఆయన అభిభాషణ. అందువల్లనే ఆయన ఈ దేవాలయంలో అద్దాన్ని ప్రతిష్ఠించ లేదు. 'అహం బ్రహ్మాస్మి' అన్న అద్వైత సిద్ధాంతాన్ని ఆచరణలో రుజువు చెయ్యడానికి ఇంతకంటే ప్రబలమైన ఆధారం లేదు. దేవుని సామ్రాజ్యం నీలో ఉన్నది అన్న క్రైస్తవ మత సూక్తిని రుజువు చెయ్యడానికి కూడా ఇంతకంటే ప్రబల సాక్ష్యం ఏమిటి? మానవుని తన ప్రతిరూపంగా భగవంతుడు సృష్టించాడన్న సూక్తిని కూడా రుజువు చేస్తున్నది. ఈ ప్రబోధంలోనే ఆయన విశ్వజనీనత కూడా ప్రస్ఫుటమవుతున్నది.

ఉన్మాద యోగిగా పేరు పొందిన శ్రీ ఛత్తంపి స్వామికల్‌తో మొదట్లో నారాయణ గురు సన్నిహితంగా ఉండేవారు. ఛత్తంపి 'క్రీస్తుమాత పిచ్ఛేదం' అన్న పేరుతో ఒక పుస్తకం వ్రాశారు. ప్రఖ్యాత సంఘ సంస్కర్త దయానంద సరస్వతి కూడా "సత్యార్థ ప్రకాశం" అన్న తన గ్రంథంలో ఇస్లాం, క్రైస్తవ మతాలు రెండింటినీ విమర్శించారు. అయితే నారాయణ గురు ఈ విమర్శనా ధోరణికి పోకుండా మతం పేరుతో విభజనకు

కాక సయోధ్యకు దోహదం చేసే ప్రక్రియలను ప్రారంభించారు. ఆయన సౌభ్రాతృత్వ మహాసభను, సర్వ మత మహాసభను ఏర్పాటు చేసారు. ఈ సర్వ మత మహాసభ ముఖద్వారం వద్ద 'వాదించి గెలువడానికి కాదు, మనం నేర్చుకుంటూనే మరొకరికి నేర్చుకునే అవకాశం ఇవ్వడానికి' అన్న లక్ష్యాన్ని వ్రాయించి పెట్టారు.

నారాయణ గురు దృక్పథంలో నిర్మాణాత్మకత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అనేక శతాబ్దాలుగా అంటరానివారుగా, అట్టడుగున పడిపోయిన ఎజవాలను ఆయన కార్యాచరణకు దింపి, వారిలో చైతన్యం కలిగించారు. కష్టించి భాగుపడమని పారిశుద్ధ్యాన్ని పాటించమన్ని, ఆరోగ్యవంతులుగా రూపొందాలని ప్రబోధించారు. ఈయన కృషి ఫలితంగానే కేరళ హిందూ సమాజంలో గణనీయమైన సంఖ్యలో ఉన్న 'ఎజవా'లు ఒక ప్రబల శక్తిగా రూపొంద గలిగారు.

కొద్ది దశాబ్దాల క్రితం వరకు కేరళ స్కూళ్లలో హరిజన బాలురను నేలపైనే కూర్చోబెట్టారు. సవర్ణుల పిల్లలు మాత్రమే బెంచీలపై కూర్చొనేవారు. ఆ పరిస్థితి నేడు తొలగిపోయింది. హరిజనులు కూడా ఇతరులవలెనే తలెత్తుకు తిరగగలుగుతున్నారు. 'ఎజెవా'లలో అట్టడుగు వారు కూడా నారాయణ గురు సందేశాన్ని అక్షరాలా పాటిస్తూ లబ్ధి పొందుతున్నారు. 'విద్యావంతులై విమోచనం పొందండి, సంఘటితమై బలపంతులు కండి' అన్నదే ఎజెవాలకు ఆయన ఉపదేశించిన తారక మంత్రం.

ఈ విప్లవయోగి బోధనలను జాతీయ స్థాయిలో ప్రచారం చెయ్యవలసిన అవసరం ప్రస్తుతం ఎంతో ఉంది. ఆయన త్రికరణ శుద్ధిగల హైందవ యోగి. మత సాంప్రదాయాలను త్రోసిపుచ్చకుండానే ఆయన నవజీవన తత్వాన్ని, కార్యాచరణ పథకాన్ని ప్రవచించారు. ఆయన ప్రవచనం సమాజంలో గుణాత్మకమైన మార్పును తేగలిగినది మాత్రమే కాక, అన్ని మతాల వారిని సమైక్యం చేయగలిగిన శక్తి దానికి ఉంది. నారాయణ గురు ఆస్తికుడే అయినా ఆయన శిష్యులలో నాస్తికులు, హేతువాదులు కూడా ఉన్నారు. తాత్వికంగా నారాయణ గురును మించిన వ్యక్తిని ఎవరినీ నేను చూడలేదు అని రవీంద్రనాథ టాగూరు ఆయనను ప్రశంసించారు. నారాయణ గురుకు ఇతరులకు మౌలికమైన తేడా ఒకటి ఉంది. ఆయన ఛాందసుడు కాదు, సముద్ధరణ వాదీ కాడు, మానవ పునరుజ్జీవనం ఆయన ధ్యేయం - అదే ఆయనకు విశిష్టతను సంతరించి పెట్టింది.

---

ఈ లోకం తరుచూ మిమ్మల్ని మీరు ఎటు వెళ్తున్నారో అటు తోస్తుంది. పైకి వెళ్తున్నారా, యింకొంచెం పైకి ; కిందికి వెళ్తున్నారా మరికొంచెం కిందకి.

—ట్రాయిన్

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాధ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్టీస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవచైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
కాఫీ మానెయ్యడం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాఘ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంధాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుహూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
పీమలబారు

వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు లైబ్రరీలో దొరికితే చదవండి.

సీరియల్

# ప్రతి గురువారం



గడిచిన కథ: ఆడిట్ బ్యూరో మంచి వస్తే, అడ్వర్టయిజ్‌మెంట్లు యివ్వ డానికి వచ్చాడనుకుంటుంది జేన్ మెక్ల విన్. 'ఆర్కయివ్' వారపత్రిక నిర్వహ ణతో తలమునకలై వున్న ఆ భార్య భర్తల కష్టసుఖాలు చదవండి ...

బాబ్ విశ్రాంతి నుంచి తిరిగిరాగానే మొట్టమొదట చేసినపని యేమిటంటే, మా అకవుంట్ పుస్తకాలు రాసేందుకు పీటర్స్‌ని కుదర్చడం. నేను ఎప్పుడూ ఆ మాట మొహంమీద చెప్పలేదు గాని, ఆ ఫెల్ట్‌హాట్‌తో అతను సెయింట్ పీటరులా కనిపించేవాడు నా కళ్లకి.

ఏభైయేళ్ళు రైల్వేలో పనిచేసి రిటై రయాక, గోళ్లు గిల్లుకుంటూ యింట్లో కూచోడం అతనికి బావుండేది కాదు. "పార్టు - టైము" అని పెట్టుకున్నాం. కాని, మొదటివారం గడిచాక, అతను మాకంటె ముందు వచ్చి, సాయంత్రం అయిదు కొట్టాక వెళ్తుండే వాడు.

పీటర్స్ రాకతో మా ఆఫీసులో నెమ్మది నెమ్మదిగా మార్పులు కలగ నారంభించాయి. ఒకరోజు మా టేబుల్ వంకచూసి అతను అన్నాడు: "నేను రయిల్వేలో పనిచేసినన్నాళ్ళూ, ఏ ఒక్కరోజూ టేబుల్ మీద కాయితాలు వుంచి వెళ్ళేవాణ్ని కాదు; ఎక్కడి వక్కడ సర్దేసి వెళ్ళేవాణ్ణి."

ఆ పాఠం నాకూ బాబ్ కూను. పీటర్ వొచ్చాక డబ్బు గొడవలు ఆలోచించడం మానేశాం.

## 15

1948 వసంతకాలానికి, మేము హాస్‌బ్రూక్ వొదిలి వేయవలసిన పరిస్థి తులు ఏర్పడ్డాయి. పత్రికని బయట పడే య్యడం, ఏ వారానికావారం, కష్టతర మవుతోంది. ఆర్కయివ్ సర్క్యులేషన్ కూడా మునుపటి కంటె బాగా పెరిగిందాయె.

ఆ వేసవికాలమంతా, మాకు పని కొచ్చే యింటికోసం చూశాడు బాబ్. పత్రికలో ఒక చిన్న ప్రకటన కూడా వేశాం. "ఆర్కయివ్ పత్రికకి కావలసిన ప్రెస్ పెట్టుకునేందుకు, ఎవరైనా తగు స్థలం చూపించి, సహాయం చేయ ప్రార్థన."

సలహాలకేం కావలసినన్ని వచ్చాయి. ఒక రైతు తన వాములదొడ్డి యిస్తాన న్నాడు. మరొకతను మా ఆఫీసుకొచ్చి - మహా మంచి స్థలం వుంది - అన్నాడు.

"ఏటవతల భేషైన నేల ఉంది. చెట్లు కొట్టించేసి, మీ యిష్టమొచ్చిన పద్ధతిలో యిల్లు కట్టించుకోవచ్చు" అన్నాడతను.

"బాగానే వుంది, చందాదారులు అక్కడికి రావడమెలా? పడవెక్కి ఏరుదాటాలి కదూ!" అన్నాడు బాబ్, నవ్వుతూ.

ఏమయితేనేం అగస్టునాటికి మాకు, వెనక గుర్రాలశాలగాను యిప్పుడు పాతకార్లు పడేసుకునేందుకూ ఉపయోగపడుతున్న ఒక షెడ్డు, దీర్ఘకాలం అద్దెకి (long-term lease) దొరికింది. అది మెయిన్ రోడ్డుకి దగ్గర్లోనే వుంది కూడా.

మా ప్రెస్ మేము పెట్టుకోవడ మన గానే, కొత్త సమస్యలు అంకురార్పణ అయాయి. ఆ గుర్రాల శాలని మా మిషన్లూ అవీ పెట్టుకునేందుకు వీలుగా మార్చాలి. ఏవారానికి అవారం పత్రిక తీసుకొస్తూ, ఇటు అశ్వశాలని యంత్రాగారంగా మార్చే నిర్మాణ కృషిని నిర్విఘ్నంగా కొనసాగిస్తూ వుండాలి. రసెల్ మా దగ్గిర మేనేజరుగా చేరేడు. బాబ్, రసెల్ యిద్దరూ పాత ప్రెస్సు లెక్కడయినా చవకగా దొరుకుతాయేమోనని వేట ప్రారంభించారు. గాలీలు, స్టోన్సూ, టైప్ స్టిక్సూ, లెటర్ ప్రెస్, ఆఫ్‌సెట్ - యిలాటి విషయాల గురించీ వాటి ధరవరల గురించీ అస్తమానం మాట్లాడుకుంటూండేవారు.

ఇలా వుండగా, ఒక శనివారంనాడు లారీమీద దిగింది నలభైఏళ్ళ వయసు గల లినోటైపుమిషను, దానిసామానుల తోటి. డవునింగ్ టవున్‌కి వందమైళ్ళ దూరంలో ఒక పశువుల శాలలో పడి వుందట ఈ మిషను.

బాబ్ బంధువుల్లో ఒకతను, నలభై అయిదేళ్ళ వయసుగల 'మియెవె' అచ్చుయంత్రమూ, 22 పెట్టెల టైపులూ పదిహేనువందల డాలర్లకి అమ్మడానికి అంగీకరించాడు. చవక బేరమే గాని, టైపులన్నీ వేటికవి సర్దుకునేందుకు మూడునెలలపాటు పట్టింది. టైపులు బయటికి తియ్యడం, దుమ్మూదుమ్ముట్రా దులిపి తుడవడం ఆ పైన వాటిని ఆయా కేసులలో పోయడం — యిదీ చేయవలసింది. మా అబ్బాయి, అమ్మాయీ మాత్రమే గాకుండా రసెల్ కొడుకూ (8 ఏళ్లు) రసెల్ కూతురూ (5 ఏళ్ళు) కూడా ఈ పనిలో ప్రవేశించారు. మా అమ్మాయేమో బ్లాకులతో మేడలు కడుతూ కూచునేది. మిగతా ముగ్గురికీ పెద్ద అక్షరాలు యిచ్చి, వేటికవి విడిగా ఏరమనేవాళ్లం. కాని, ఏం ప్రయోజనం? ముగ్గురు పిల్లలూ టైపు లేరడం మర్చిపోయి, "నన్ను ముట్టుకోకోయ్" అట ఆడుకొనేవారు. మా ఇంటి యజమాని విద్యుత్పరికరాల వ్యాపారి. అంచేత, మాకో అయిస్ బాక్సూ, రేడియో యిచ్చాడు. ఆర్కాయివ్ అచ్చుయంత్రం ఎంతదాకా వచ్చిందని, దారినిపోతూ మమ్మల్ని పలకరించేవాళ్లకి రేడియో సంగీతమూ, చల్లటి పానీయమూ ఉచితంగా లభించేవి.

తెల్లారితే పత్రిక వస్తుందనగా, అంతకి క్రితం రాత్రిపడ్డ అవస్థ వర్ణనాతీతం. ఆఖరి పేజీలలోని యడ్వర్టయిజ్‌మెంటు హెడ్డింగులకి గళ్ళలో

టైపులేదు. డ్రాయర్లు తెరిచి అక్షరాలు వెతక నారంభిచాము. లోయర్ కేసు "a" (చిన్న అక్షరం) అని ఒకరూ పద్ధెనిమిది పాయింట్లు డివిన్ని "p" కావాలని ఒకరూ - అంతా గందర గోళమే కదా - ఆ రోజున 24 పాయింట్ల "q" అడుగు భాగాన్ని ఛేదించి "a" గా చేశాం - ఒక యడ్వర్టయిజ్‌మెంటులో.

మా ప్రెస్‌లో అచ్చయిన పత్రికని చూసుకుంటే మాకే సిగ్గేసింది. ఒక వ్యాసం మొదటినుంచి చివరివరకు అర్థరహితంగా ఉంది. ఎందుకంటే "P"లు వుండవలసిన స్థానంలో "m"లు వున్నాయి. ఆ కోతిపని మా 'లినో టైపు' చేసింది.

రాత్రి ప్రింటింగ్ మొదలుపెడతా మనగా, ఆ సాయంత్రం వేళ స్నేహితులూ యడ్వర్టయిజర్లూ వొచ్చి మాకు శుభాకాంక్షలు అందజేసి వెళ్లారు. బైండింగ్ వేళకి ఉత్తమ గుణశీలురైన బాబ్ మేనత్త లిద్దరూ అందుకున్నారు. ఆరోజు మడతపని అందరం కలిసి మేఘాలమీద పూర్తి చేశాం. సరిగ్గా అయిదూ నలభై అయిదుకి (ఉదయం) పత్రిక కట్టలు కారులో పడేసుకు, పోస్టాఫీసుకి వురుకులెత్తాం.

ఆరుకి యింకొక్క నిముషం ఉందనగా పోస్టాఫీసు చేరుకొని "హమ్మయ్య!" అనుకున్నాం. ఎంత అలిసిపోయి వున్నామో చెప్పలేను.

మొఖానికి వున్న సిరామరకలు కూడా తుడుచుకోకుండా, ఆ బట్టల తోటే పక్కమీదపడి, వొళ్ళు తెలియ కుండా నిద్దరపోయాడు బాబ్.

నాకు అలా ఎలా కుదురుతుంది? శుభ్రంగా స్నానం చేశాక అబ్బాయిని బడికి తీసుకువెళ్ళాను. ఆరోజు వాళ్ళ స్కూలులో ఏదో ప్రదర్శన అయేదాకా అదర్శమాతలా కూచున్నాను - కళ్ళ మీదికి కూరుకొచ్చే నిద్రపైకి కనపడ నీయకుండా, కంటినిండా నిద్రకి నోచుకోని ఈ దాంపత్యం భేషుగ్గా వుందే! - అనుకున్నాను. శిరసునుంచి పాదాలదాకా ఒకటే అలసట. కాని, అది నేను సంతోషంతో స్వీకరించిన అలసట.

నెమ్మది నెమ్మదిగా ఎక్కువ టైపులు కేసులలో పోశాం. ప్రెస్‌కి దగ్గరగానే మేము వుండటం వల్ల ప్రతి వారం 200 మైళ్లు తిరగవలసిన తిప్పట మాకు తప్పింది. మా వెండల్ (మోటారుకారు)కి అప్పుడే తొమ్మిదో యేడు వచ్చింది. అర్ధరాత్రి వేళ నేనూ బాబ్ మా ప్రెస్ చుట్టూతా తిరుగుతూండేవాళ్ళం. "యివి నిజంగా మావేనా?" అన్నట్లు, ఆ టైపుకేసులూ ఆ మిషన్లూ ముట్టుకు చూసేవాళ్ళం. "మీవే సుమండీ!" అని ఏ నెలకానెల బాంకువాళ్ళు జ్ఞాపకం చేస్తూండేవారు. రసెల్ కొన్ని యితరమైన ప్రింటింగు పనులు తీసుకురావడంతో, మేము కాస్త తేరుకోగలిగాం.

మా కంపెనీ పేరు ఛెస్టర్ వాలీ ప్రెస్. బాబ్ ప్రెసిడెంటు, నేను వైస్ ప్రెసిడెంటుని; రసెలేమో కోశాధికారీ, సెక్రెటరీ. రోజులు గడిచిన కొద్దీ మా సమస్యలు పెరగడం మొదలెట్టాయి. ఆ సమస్యలు ఎంతకీ యంత్రాలకి సంబంధించినవే. హానీబ్రూక్‌లో ఉన్న న్నాళ్ళూ మాకీ యంత్రాల బెడద లేదు. ఒక్కొక్కనాడు ఆఖరు క్షణాన అచ్చుయంత్రం మొండికేసేది: లేకపోతే లినో టైపు చెప్పినమాట వినేది కాదు.

బాబ్, నేనూ యంత్రాలు కూడా మనుషుల్లాంటివే — అను నమ్మకానికి వచ్చాం. ఒక్కొక్కరోజున మారాం మొదలెట్టేవవి; కొన్ని గంటల సేపు మంచి మాటలు చెప్పి బతిమాలుకుంటే, దారిన పడేవి.

## 16

పత్రికని బాగా వృద్ధిలోనికి తీసుకు రావాలని మేము చేసిన ప్రథమ ప్రయత్నం, మమ్మల్ని దివాలా తీయించేటంత దగ్గిరకి పట్టుకొచ్చింది.

హంఫ్రీ బారన్స్‌ను అ తోటి సంపాదకుడొకతన్ని కలుసుకొచ్చి, బాబ్ అన్నాడు: "మనకి కొత్త మిషను వస్తుంది"

"ఎక్కడ నుంచి? విమానంలో నుంచి దిగుతోందా?" అని అడిగాడు మేనేజరు రసెల్.

"మనకి కావలసింది డబ్బు. బారన్స్ యిట్టే నాలుగు వేల డాలర్లు సంపాయించాడు. మనమూ ఆ పని చేస్తే సరి!" అన్నాడు బాబ్.

తన పత్రిక "డిలా వేర్ వీక్లీ" సర్క్యులేషన్ పెరిగేందుకు బారన్స్ నడిపిన పోటీ విజయవంతంగా పరిణమించింది. ఎవరు ఎక్కువ చందాలు పోగు చేస్తే, వారికి మొదటి బహుమానం మూడువేల డాలర్లు ఖరీదు

వేసే బ్యాక్ కార్; రెండవ బహుమానం 750 డాలర్లు రొక్కం—యిలా యింకా చాలా ప్రయిజులు వున్నాయి. రెండువేల మంది కొత్త చందాదారులు వచ్చారు: ఒక వెయ్యి మంది చందాలు 'రిన్యూ' చేశారు. ఏమయితేనేం, ఖర్చులుపోను నాలుగువేలు నికరంగా మిగిలింది బారన్స్‌కి. మా ప్రార్థనలకి సమాధానమా అన్నట్టు కనిపించింది ఈ మార్గం. ఒకవేళ మేము అదుకున్నంత రాకపోతే, మా పని దివాలేగా!

ఒక వారం రోజులపాటు మధన పడి, ఈపోటీ విషయమై మరొక కంపెనీతో వొప్పందం చేసుకు, సంతకం పెట్టివొచ్చాడు బాబ్. ఆ సంగతి నాకు చాలారోజుల దాకా తెలియలేదు. తెలిశాక మహవ్యాకుల పడ్డాను.

నవంబరు మొదటివారంలో చందాలపోటి గురించిన ప్రకటన పత్రిక మొదటి పేజీలో పెద్దక్షరాలతో పడినది. బాబ్ ఆ ప్రకటనని బెదురుతూ చూశాడు.

చందాలు రావడం, పోటీదారులు రావడం బహునెమ్మదిగా జరిగింది. కొన్నాళ్ళయేటప్పటికి మా కూలిపోయాయి. బ్యాక్ కారు అప్పోసొప్పోచేసి కొనియివ్వక తప్పదు; అందుకు దక్షిణగా 750 డాలర్లు రొఖ్ఖం కూడాను.

మేము అఖరుక్షణాన ఏదో గమ్మత్తు చేస్తామనీ కారు యివ్వడం అబద్ధమనీ ఊళ్లో పుకారు బయలుదేరింది.

ఒక శనివారం నాడు బాబ్ పోటీదారు లందరినీ మా ఆఫీసుకి పిలిపించి, యిలా చెప్పాడు: "ఈ పోటీ ద్వారా వచ్చే చందాల పైకమంతా ప్రయిజుల కోసమనే వినియోగింపబడుతుంది. నాకేమీ అఖ్ఖర్లేదు, నన్ను యిరుకున పెట్టనూ వద్దు, మీరు యిరుకున పడనూ వద్దు. నాకు వున్న సమస్తం అమ్మేసి అయినాసరే,

మొట్టమొదట ప్రచురించిన ప్రకారం ప్రయిజులు యిచ్చి తీరుతాను."

కొత్తసంవత్సరాది నాటికి ఆ పీడ కల నుంచి విముక్తుల మయాం. మొదటి బహుమతి బ్యూక్ కారు పుచ్చుకున్నతని ఫోటో, రెండవ బహుమతి 750 డాలర్లు చెక్కు పుచ్చుకున్నతని ఫోటో - రెండు ఫోటోలూ వారు ఆయా బహుమతులు స్వీకరిస్తుండగా తీసి, పత్రికలో అచ్చువేశాం. అంతా అయాక బాబ్ లెక్కలు చూశాడు. మాకు మిగిలింది 32 డాలర్లు 50 సెంట్లు. కొత్త సంవత్సరాది నాటికి ఆ మాత్రం మిగిలింది, ఫరవాలేదు - అనుకున్నాం.

ఆర్థికంగా మేము వెనక ఎలా వున్నామో, యిప్పుడూ అంతే. అదనంగా వచ్చిందేమిటంటే, బాబ్‌కి ఈ మనస్తాపంవల్ల రెండు కురుపులు లేచాయి. కాస్త ఊపిరి పీల్చుకున్నాక, ఈ చందాలపోటి మాకు మేలు చేసిందని తెలుసుకోగలిగాం. ఎలాగంటే, ఆర్థికంగా కాకపోయినా, యితరత్రా వృద్ధిలోకి తీసుకొచ్చింది.

పోటీలో పాల్గొన్న యిరవైమంది పోటీదారులూ గౌరవనీయమైన కుటుంబాలకి చెందినవారు. ఆరువారాలపాటు వారు రాత్రింబవళ్లు అర్కాయివ్ ప్రచారం కోసం పాటు పడ్డారు. ఎనిమిదివందల యిరవైమంది కొత్తచందాదారులని చేరిపించారు; మూడువందలమంది చందాలు 'రిన్యూ' చేయించారు. కాని బారన్స్ 'డిలావేర్ వీక్లీ' జరిపిన పోటీకీ మాదానికీ పోలిక ఎక్కడ? బహుశా ... వేరేమో! మాకు అం... ...లో వున్న యావన్మంది అర్కాయివ్ పత్రిక పేరు విన్నారు; చాలామంది చందాదారులుగా చేరారు. అంతకంటె ఏం కావాలి? కొత్త మిషన్ కావాలనుకోండి - అదే వేరే సంగతి.

## 17

బాబ్ డిలావేర్ వెళ్లి, చందాల పోటి గురించి తెలుసుకు వచ్చినప్పట్నుంచీ, మేము పదహారు పేజీల పత్రిక ప్రచురిస్తున్నాం.

బాబ్ ఒకసారి రాశాడు. ఈ సంగతి. అతని మాటల్లోనే చెబుతాను.

"అచ్చు మిషనుల ధనధన, టైప్ రైటర్ల టకటక సంగీతం పాడుతూండగా, రాబందు ముక్కుగల ఒక పొడుగుపాటి అతను, వుబ్బిన తోలు సంచీ పుచ్చుకు, తిన్నగా నా టేబుల్ దగ్గరికి వచ్చి నా ముక్కుకి సూటిగా తన విజిటింగ్ కార్డు వుంచాడు.

"నేను రాస్తున్నది ఆ వారం పత్రిక మొదటి పేజీలోనికి ముఖ్యమైన శీర్షిక వ్యాసం. అప్పటికప్పుడే పది హేను సార్లు, నన్ను అనేకులు పలకరించారు. అమెరికా ప్రభుత్వపు కార్మికశాఖకి చెందిన "వేజ్ అండ్ అవర్ డివిజన్ (Wage and Hour Division) ఉద్యోగస్థుణ్ణి" అని అతను చెప్పుకోవడం, కాస్త పరధ్యానంగా విన్నమాట నిజమే.

"అలాగే - అలాగే. బావుంది బావుంది" అంటూ అతన్ని మా పీటర్స్ దగ్గరికి తీసుకువెళ్లాను. (ఇంకా వుంది

